## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంథాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంథాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంథాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంథాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంథాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement**(SAI RAM) - **సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US | Search

: COMPLAINTS PLS CONTACT e MAIL saptagiritd@gmail.com CAN CALL 0877 226 4359, 4543,4360,4363, 4385 BETWEEN 10.30 AM AND 5.PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri

Telugu Tamil
Sanskrit Kannada
Hindi English

Online Subscription

Panchangam

Telugu
Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam

Narada Bhakthi Sutra...

prev next

Maha Bharatham - Bhagavatham

Maha Bharatham Vol 1...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మాండూక్యోపనిషత్

## (ఆంధ్ర పద్య తాత్పర్య సహితము)




ర చ న :

మ ధు ర క వి

**దేవులపల్లి చెంచు సుబ్బయ్య M. A.**

ఆ దో ని (కర్నూలు జిల్లా)

# ముండకోపనిషత్తు

(ఆంధ్రపద్య, చంద్రికా లఘు వ్యాఖ్యాన సహితము)




రచయిత :

ప్రముఖ రేడియో వ్యాఖ్యాత

ఉత్తమోపాధ్యాయునిగా ప్రభుత్వ అవార్డు గ్రహీత

కవి కిశోర, భక్త కవిరత్న, మధురకవి

భాషా ప్రవీణ **దేవులపల్లి చెంచు సుబ్బయ్య,** ఎం. ఏ.,

ప్రధానాంధ్ర పండితులు

జిల్లా పరిషదున్నత పాఠశాల

పెద్దతుంబళము

ఆదోని (మండలము) కర్నూలు (జిల్లా)





ప్రకాశకులు :

శ్రీ **దేవులపల్లి చెంచు సుబ్బయ్య,** ఎం. ఏ.,

శ్రీ లలితా కవితా నికేతనము

ఇంటి నంబరు **2-186-1** టీచర్స్ కాలని

ఆదోని ఆర్ట్స్ & సైన్సు కాలేజి ఎదురుగ

ఆదోని - **518 302** :: కర్నూలు (జిల్లా)

ముండకోపనిషత్తు

ప్రథమ ముద్రణము : యువ 1995

ప్రతులు : 2000



వెల : రు. **15-00**

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆర్థిక సహాయముతో మత సంబంధమయిన పుస్తక ప్రచురణ సహాయ పథకము క్రింద ప్రచురింప బడినది.

BHARADWAJA PRINTING & BINDING WORKS.
RAJAHMUNDRY – 4.

ప్రతులకు:
శ్రీమతి దేవులపల్లి ప్రభావతిగారు
W/o శ్రీ దేవులపల్లి చెంచు సుబ్బయ్య గారు
శ్రీ లలితా కవితా నికేతనము
ఇంటి నంబరు 2-186-1 టీచర్స్ కాలని
ఎ. ఎ. ఎస్. కాలేజి ఎదురుగ
ఆదోని – 518 302
కర్నూలు (జిల్లా)

# ఉపోద్ఘాతము

వేదములు భారతీయులకు బరమ పవిత్రములైన ప్రమాణ గ్రంథములు. ఇవి కర్మోపాసనా జ్ఞానాత్మకములై యీ త్రివిద విషయములను బోధించుచున్నవి సంహితా బ్రాహ్మణములను వేద భాగములందు సాధారణముగా గర్మకాండకు సంబంధించిన విషయములే అధికముగా నుండును ఉపనిషద్భాగములందు ఉపాసనాకాండ, జ్ఞానకాండకు సంబంధించిన విషయములు ముఖ్యముగా జెప్ప బడినవి. కర్మోపాసనలు రెండును జ్ఞానమునకు సాధనములనియు, జ్ఞానము సాధ్యమనియు నుపనిషత్తుల సారము. వేదముల చివరి భాగము లగుటచే వేదాంతములని వ్యవహరింప బడుచున్నవి. ఉపనిషత్తులు మానవులకు జన్మసార్థక్యమొనరించుకొనుటకు దరణోపాయమును బోధించుచున్నవి.

మన ప్రాచీన మహర్షులు సత్యాన్వేషణమొనరించి విశ్వశ్రేయమునకై తమ దివ్య జ్ఞానాను భూతుల నీ యుపనిషత్తుల రూపమున బ్రవచించిరి ఉపనిషత్తుల యందలి కమనీయ కవితా మాధుర్యము, మహోన్నత భావపరమార్థము నేటికిని మానవ బుద్ధులను రంజింప జేసి, హృదయముల నాకర్షించుచునే యున్నవి. మిగుల బ్రాచీనములగు భారతీయ విజ్ఞాన రత్నము లందు గలవు. మన మహర్షుల మహోన్నత భావనాశక్తికివి చక్కని తార్కాణములు. వారి కమనీయ కవితా శక్తికివి ఉత్తమ వైజయంతికలు ఇవి కేవలమొక పరమార్థ సత్యమును బ్రదర్శించుటయే కాక, తపించుచున్న మానవ హృదయమునకు శాంతి స్వాతంత్ర్యములను సమకూర్చుచున్నవి. జీవిత సమస్యలతో సతమతమగు సత్యాన్వేష. హృదయపు లోతుల నుండి పెల్లుబికి, పొంగి ప్రవహించిన కవితా మధుర గీతములు ాఢ భావ వాహినులీ యుపనిషత్తులు. సత్పదార్థ స్వరూప సందర్శనమునకై మాన. హృదయము చూపిన పరితాపమునకు, పరిశ్రమకివి చక్కని మణి దర్పణములు. ధ్యానయోగముననివి సాధించిన సత్ఫలితములు సర్వదా ప్రశంసనీయములు.

ఉపనిషత్తులలో బ్రధాన విషయము సత్యాన్వేషణము సత్స్వరూప సమస్యా పరిష్కారము. ఈ విషయమున నుపనిషత్కర్తలగు విజ్ఞానవేత్తలు వేద ద్రష్టలు జూపిన బాహ్యదృష్టి నాంతరంగిక దృష్టితో సమ్మిళిత మొనరించిరి. ఇవి ప్రధానముగా నాత్మ సమస్యనే చర్చించినవి ప్రాచీనులైన బుద్ధ శంకరులు కపిల పతంజలులుపనిషత్తులనే ప్రమాణముగా స్వీకరించి పరస్పరవిరుద్ధసిద్ధాంతముల బ్రతిపాదించిరి మ్యాక్స్‌ముల్లర్, డ్యూసేన్, హ్యూమ్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్, జె. ఎన్. మెకంజీ మున్నగు ప్రముఖ పాశ్చాత్య

పండితులెందరో పరమ పవిత్రోపనిష ద్విజ్ఞానామృతపానమొనరించి వేనోళ్ల గొనియాడిరి బ్రహ్మసమాజ మత సిద్ధాంతములకీ యుపనిషద్భావములే ప్రధానాధార మూల స్తంభములు. ఉపనిషత్తులలో నిర్వచించిన జ్ఞాన భాండాగారమే వేదాంతము.

విశేష పరిశోధన గావించి పండితులు తాళపత్రములలో నున్న ౩౦౦ ఉపనిషత్తులను లోకమున కందించిరి అందు ౧౦౮ ఉపనిషత్తులు మిగుల ప్రాచుర్యము నందినవి. శంకర రామానుజ మధ్వ వల్లభాచార్యాది వైదికమతా చార్యులందరు దశోపనిషత్తులకు వ్యాఖ్యానముల రచించిరి దశోపనిషత్తులనగా: ౧. ఈశోపనిషత్ ౨ కేనోపనిషత్ ౩. కఠోపనిషత్, ౪. ప్రశ్నోపనిషత్ ,౫. ముండకోపనిషత్ ౬. మాండుక్యోపనిషత్ ౭ ఐత్తరీయోపనిషత్. ౮. తైత్తిరీయోపనిషత్ ౯. ఛాందోగ్యోపనిషత్ ౧౦. బృహదారణ్యకోపనిషత్ సర్వోపనిత్తుల భావములు, సిద్ధాంతములు దశోపనిషత్తుల యందు సమగ్రముగా సంపూర్ణముగా లభించును. ఈ దశోపనిషత్తులు అత్యంత ప్రాచీనములు. పరమ ప్రమాణములునైనవి పూర్వోపనిషత్తుల కాలము క్రీ. పూ. ౧౦౦౦ – ౩౦౦ ల మధ్య కాలము. అత్యంత ప్రాచీనోపనిషత్తులు కొన్ని బుద్ధునకు పూర్వమందున్నవి. పూర్వోపనిషత్తులు గద్యరూపమున నున్నవి. ఐతరేయము, కౌశీతకి, తైత్తిరీయము, ఛాందోగ్యము, బృహదారణ్యకము, కేనోపనిషత్తులు ప్రాచీనతమములు. వీనిలో చివరిది మాండూక్యోపనిషత్తు. తరువాత వచ్చినవి పద్యరూపమున నున్నవి గద్యాత్మకములగు ప్రాచీనోపనిషత్తులలో దత్త్వజిజ్ఞాస కలదు. తరువాన రచింపబడినవానిలో భక్తిపూజా భావములున్నవి.

దశోపనిషత్తులలో ముండకోపనిషత్తు మిగుల ప్రముఖమైనది, సుందరమైనది.

౧. ముడి ఖండనే
౨. ముడి మార్జనే
౩. ముండి ఖండీన ప్రమర్దనయోః

అజ్ఞానమును ఖండించునది లేక ముముక్షువులగువారి సంశయములను దొలగించి వారికి సత్యమైన జ్ఞానమును గలుగ జేయునది అని భావము 'ముండ' మనగా శిరస్సునకు గూడా పేరు గలదు సర్వోపనిషత్తులకిది శిరస్సు వంటిది. కావున నీయుపనిషత్తునకు ముండకోపనిషత్తను సార్థక నామము వ్యవహారమునందున్నదని మనము భావించవచ్చును.

ముండకోపనిషత్తునందు మూడు ముండకములు గలవు. ఒక్కొక్క ముండకము రెండేసి ఖండములుగా విభజింప బడినది. మూడు ముండకములతో, ఆరు ఖండములతో ౬౪ మంత్రములతో బ్రహ్మజ్ఞాన శోభితమైయున్నది. ఇది అధర్వణ వేదమునందు గోచరించుచున్నది.

''ఉపనీయ తమాత్మానం
బ్రహ్మాపాస్త ద్వయం యతః
నిహంత్య విద్యాం తజ్జం చ
తస్మా దుపనిషత్ భవేత్''

బ్రహ్మకు సమీపమున మనల నుంచ గలుగు జ్ఞానమును తనయందు గలిగి యుండుటచే వేదాంత విద్యకు ఉపనిషత్ అను పేరు గల్గినది

''నిహత్యానర్థ మూలం స్వా
విద్యాం ప్రత్యక్తయా పరం
నియస్య పాస్త సంభేద
మతోవోపనిషత్ భవేత్''

బ్రహ్మమును దెలియ జేసి ముముక్షువులు బ్రహ్మసాక్షాత్కారము నొందుటకు సహకరించుట చేత బ్రహ్మజ్ఞానము ఉపనిషత్ అను నామమును బొంది యున్నది.

జీవుని అజ్ఞానాందకారమంతయు జ్ఞాన కాంతులతో నంతరించి పోవలయును. ఆజ్ఞాన జ్యోతిని అంతేవాసి కందించి ఉద్ధరించు మహితాత్ముడే గురు దేవుడు.

''గుకారశ్చాన్ధ కారస్తు
రుకారస్తన్నిరోధ కృత్
అంధకార నిరోధత్వాత్
గురురిత్య భి ధీయతే''

'గు' అనగా చీకటిని 'రు' అనగా పోగొట్టువాడని భావము - జీవునకు అవిద్య వస్తు ప్రపంచ జ్ఞానము లేనందున కలిగినది కాదు. స్వస్వరూప జ్ఞానము లేనందున సంప్రాప్తించినది. స్వస్వరూప జ్ఞానమునాత్మ విద్యనార్జించుట ద్వారానే పొందవలయును. ఆత్మజ్ఞానము ఆచార్యుని బోధ ద్వారానే లభ్యమగును.

''ఉదయంతు శతమాదిత్యాః
ఉదయంతు శతమిందవః
నవినా వి దుషాం వాక్యైః
నశ్యత్యాంభ్యంతరం తమః''

శతసూర్యులుదయింతురు గాక!
శత చంద్రులుదయింతురు గాక!

ఆచార్యుని బోధ లేనిదే లోపలి అంధకారము నశింపదు

బ్రహ్మవిద్య గురుపరంపరగా వచ్చినది అందువలన దీనిని కర్ణపరంపరయని గూడా వహరిస్తారు.

గురువగు అంగీరస మహర్షికి, శిష్యు డైన శౌనక మునికి మధ్యన జరిగిన సంవాద రూపమే ముండకోపనిషత్తు, అమరదామమున కానంద మార్గము నేర్పరచిన అమృతోపనిషత్తు ముండకోపనిషత్తు

''కస్మిన్ను భగవో విజ్ఞాతే
సర్వమిదం విజ్ఞాతం భవతి''

దేనిని దెలియుటచేత యీ ప్రపంచ జ్ఞానమంతయు తెలియ బడుతుంది? దానిని తెలియ జేయమని శిష్యుడైన శౌనకు డు గురువగు అంగీరసుని ప్రారంభములోనే ప్రార్థిస్తాడు ఈ ప్రశ్నయే శిష్యుని బ్రహ్మ విద్యాసక్తిని దెలియ జేస్తుంది

ఇక గురూప దేశమెంత అమృత సమానమో ప్రత్యేకముగా వివరింపఁ బనిలేదు

ఉపనిషత్సారమును జిజ్ఞాసువులకు సుబోధముగా దెలుపుటకు ప్రశ్న ప్రతివచన పూర్వకముగా 22 ఉపనిషత్తులకు 18 అధ్యాయములతో శ్రీమచ్ఛంకరానంద భగవత్పాదా చార్యులవారు శ్లోకములలో ఆత్మపురాణమును రచించిరి

నేనీ ముండకోపనిషత్తునందలి అరువది నాలుగు మంత్రములను పద్యములలో నాంధ్రీకరించి, మంత్రపద్యతాత్పర్య సహితముగా తమ కరకమలములయందుంచుచున్నాను వేదాంత విద్యా ప్రియులకీ యనువాద మానంద సందాయకమగుచో నా కృషి ధన్యమగును అజ్ఞాన కృతములును, భ్రమ ప్రమాద జనితములగు దోషములున్నచో పండితులు దయతో దెలిపిన కృతజ్ఞతతో గ్రహించి సంస్కరించుకొనగలవాడను

నాయీ గ్రంధముద్రణమున కార్థికముగా హార్దికముగా సహకరించిన తి తు దేవస్థానము వారికి, భక్తమహోదారులకు ఆనందాభి నందన వందననందన నవహరిచందనములర్పించు కొనుచున్నాను

నాయీ ఆంధ్ర పద్యానువాద, చంద్రికా నామ లఘు వ్యాఖ్యాన సహిత ముండకోపనిషత్తును వేదవేదాంత సంవేద్యుండగు శ్రీవెంకటేశ్వర స్వామి వారి పరమపావన దివ్య భవ్య శ్రీపాదార విందములకు సభక్తికముగా సమర్పించుకొనుచున్నాను

గీ పరమ పావనములు సౌఖ్య భాజనములు
శుభకరంబులు లలితముల్ సురుచిరములు
పాపహరములు నీపదపంకజములు

భక్తి గొలువ బ్రాప్తింపవేఫలము లెల్ల

ఓం తత్సత్

సర్వం శ్రీ పరమేశ్వరార్పణమస్తు

విద్వజ్జన విదేయుః డ

కవికిశోర, మదురకవి, భక్తకవిరత్న

**దేవులపల్లి చెంచు సుబ్బయ్య,** ఎం ఏ

భాషాప్రవీణ



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

## శాంతి మంత్రః

ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిర్య జత్రాః
స్థిరై రంగైస్తుష్ఠు వాగ్ం సస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తిన ఇంద్రో వృద్ధ శ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతి ర్దధాతు॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సీ. సురలార! చెవులతో శుభదమౌ దానినే
వినెదము గాక సంప్రీతి తోడ
పూజ్యులార! కనుల ముదమున శుభదంబు
లను గనెదము గాక యనవరతము
సుస్థిరాంగంబుల శోభిల్లు తనువుల
సంస్తుతించుచు మిమ్ము సంతతంబు
దేవహితంబగు జీవిత మారోగ్య
పూర్ణంబుగా భువిం బొందంగలము

గీ. భువి సనాతన దివ్యర్షి పూజితార్యు

డింద్రుడెప్పుడు శుభముల నిచ్చుంగాక!

శుభములొసగు సర్వజ్ఞుండా సూర్యుడెపుడు

స్వస్తియగుగాక! మకేప్పు స్వస్తి స్వస్తి.

గీ. ఆపదల నుండి కాచెడి యనిలు డెపుడు

సురగురుండు బృహస్పతి శుభము లొసగు

స్వస్తియగుంగాక మాకెపు స్వస్తి స్వస్తి

*శాంతి ఓం శాంతి ఓం శాంతి శాంతి శాంతి*

## భావము

ఓ యింద్రాది దేవతలారా! మీ యనుగ్రహము వలన మా చెవులతో శ్రుతి స్మృతి పురాణ ప్రతిపాదిత మయిన శుభప్రదమగు సత్యసిద్ధాంతమునే శిష్యాచార్యులమగు మేము వినుచుందుము గాక! ఓ పూజనీయులారా! అట్టి సచ్ఛ్రవణము చేత పవిత్రుల మైన మేము మా కన్నులతో శుభప్రదమగు సత్కృత్యములనే చూచెదము గాక! భగవానుండు మా కనుగ్రహించి యిచ్చిన కరచరణాద్యఖిలావ యవములు బాగుగా నాయా కర్మల నిర్వహించుకొనుటకు సమర్థములై యుండి ఆతడొసంగిన సంపూర్ణాయుష్కాలమును అకాలమరణాది దురవస్థలు లేక పరిపూర్ణారోగ్యముతో, శక్తితో జీవించెదముగాక! సనాతన మహర్షులచే సంస్తుతింపంబడిన ఇంద్రుండు శిష్యాచార్యులమగు మాకు శుభములు నొసంగుఁగార్చుంగాక! సర్వజ్ఞుండైన సూర్యుండు మాకు శుభమును గలుగంజేయుంగాక! ఆపదలనుండి రక్షించు వాయుదేవుండు మాకు శుభమునను గ్రహించుంగాక! మాలోని ఆధ్యాత్మిక సంపదను రక్షించి కాపాడు బృహస్పతి మాకు శుభమును బ్రసాదించుంగాక! మాకు ఆధ్యాత్మిక ఆది భౌతిక ఆది దైవిక తాపత్రయములు శాంతించుంగాక!



# ముండకోపనిషత్తు

## ప్రథమ ముండకము

### ప్రథమ ఖండము

### 1 – వ మంత్రము

ఓం బ్రహ్మో దేవానాం ప్రథమః సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా
స బ్రహ్మ విద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠా
మథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ॥

ఉ. ఆదిజుఁడైన బ్రహ్మసురలందరి కాద్యుఁడు విశ్వకర్తయౌ
వేద విశేషవిజ్ఞుఁడు సువిద్యల కున్ దగ మూలమై సదా
మోదముఁ గూర్చు విద్యనట ముందుగఁ దెల్పెను బ్రహ్మవిద్య న
త్యాదర మొప్ప జ్యేష్ఠసుతుఁడైన యథర్వున కంత నొప్పుగన్

### భావము

ముండకోపనిషత్తు నందలి ప్రథమ మంత్రము 'బ్రహ్మ'-యను మంగళ వచనముతోఁ బ్రారంభమగుచున్నది.

విశ్వము యొక్క సృష్టికర్తయు, రక్షకుడును నగు బ్రహ్మదేవుడు దేవతలందరి కంటెను ముందుగఁబుట్టెను. సకల విద్యలకు నాధారము. నాశ్రయమగు బ్రహ్మవిద్యను బ్రహ్మ తన జ్యేష్ఠపుత్రుఁడగు 'అథర్వు' నకుఁదెలియఁజేసెను. బ్రహ్మదేవుఁడు దేవతలలోఁ బ్రథముఁడై పుట్టెను.

ప్రథముఁడగుటచే 'బ్రహ్మ' ఆదియైనాడు. జగత్తంతయు తననుండే ఆవిర్భవించి యున్నది. కావున తానే సృష్టికర్త!. సృష్టించువాడే భరించువాడు. కావున బ్రహ్మయే రక్షకుఁడైనాడు. సృష్టికర్తయగు బ్రహ్మకు సృష్టిజ్ఞానముండవలయును. వివిధ రూపములతో నావిర్భవించిన సృష్టిలో వివిధ విద్యలు బయలు దేరినవి. కావున బ్రహ్మకు సకల విద్యలకు సంబంధించిన పరిపూర్ణ జ్ఞానమున్నది. సమస్త విద్యలు సృష్టినిఁ గూర్చి తెలుపు చుండ బ్రహ్మవిద్య సకల విద్యల కాశ్రయమైయున్నది. బ్రహ్మవిద్య మాత్రమే మాయను దొలగించి అమృతత్త్వమును బ్రసాదింపఁగలదు. నీవెవరో నీకుఁదెలుపునదే బ్రహ్మవిద్య. నిన్ను నీకుఁ జూపునదే బ్రహ్మజ్ఞానము. తండ్రికిఁ దనపుత్రునిపై వాత్సల్యమధికముగా నుండును. పుత్రునకును పితృభక్తి, గౌరవము, ప్రేమ, అధికముగా నుండును. తండ్రియును గురువు నొకరే యయినపుడు గౌరవము, ప్రేమ, భక్తి, శ్రద్ధలు ఒకరిపైననే యుండి విశేష జ్ఞానమును బొందుట కవకాశ మేర్పడును. భృగువు తండ్రి, గురువునగు వరుణుని కడ వేదాంత విజ్ఞానమును నేర్చుకొనెను. శ్వేతకేతువు తనతండ్రి గురువు నైన ఉద్దాలకుని చెంత నాత్మజ్ఞానము నభ్యసించెను. అథర్వుఁడు తన తండ్రి గురువైన బ్రహ్మదేవుని వద్ద బ్రహ్మవిద్యను నేర్చుకొనుచున్నాడు.

## 2–వ మంత్రము

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మా
థర్వతాం పురోవాచాంగిరే బ్రహ్మ విద్యామ్
స భరద్వాజాయ సత్యవాహాయ ప్రాహ
భారద్వాజో౽ంగిరసే పరావరమ్॥

గీ. బ్రహ్మతొ౽ దొల్తఁ దెలిపిన బ్రహ్మవిద్య
నాయథర్వుఁడు బోధించె నంగిరునకు,
నతడు దెల్పె భారద్వాజుఁడైన సత్య
వాహునకు, నంగిరసునకు వాడు దెలిపె.

### భావము

బ్రహ్మదేవుఁడు బ్రహ్మవిద్యను మొట్టమొదట తన జ్యేష్ఠపుత్రుఁడగు అథర్వునకుపదేశించెను. అథర్వుఁడా బ్రహ్మవిద్యను పూర్వము అంగిరునకుపదేశించెను. అంగిరుఁడు భారద్వాజగోత్రోద్భవుఁడైన సత్యవాహునకు బోధించెను. భారద్వాజుఁడగు సత్యవాహుఁడు

పరావర్గయగు నీ బ్రహ్మవిద్యను అంగిరున కుపదేశించెను. బ్రహ్మవిద్యగాని మరే విద్యగాని గురుపరంపరాప్రాప్తమై యుండవలయును. అపుడే యా విద్య స్వచ్ఛముగా నుండును. మన మధ్యయనముఁజేయు ముండకోపనిషత్తునందు అంగిరస మహర్షియే ఆచార్యుఁడు. తననాశ్రయించిన శౌనక మహర్షికిఁ దనకు జరిగిన సంభాషణమే ముండకోపనిషత్తు.

## 3 – వ మంత్రము

*శౌనకోహవై మహాశాలో౽౦గిరసం*
*విధివదుపసన్నః ప్రవచ్ఛ*
*కస్మిన్ను భగవో విజ్ఞాతే*
*సర్వమిదం విజ్ఞాతం భవతీతి॥ 3*

చ. *శునక మహర్షిపుత్రుఁడును సువ్రతుఁడుత్తమ సత్యనిష్ఠుఁడున్*
*మునివరుఁడైన శౌనకుఁడు ముందుగ నంగి రసాఖ్యుఁజేరియున్*
*వినయ సుభాషణుండగుచు వేడెను దేని నెరింగినన్ జగం*
*బునఁ దగనంతయున్ దెలియుఁ బూజ్యుఁడవంతయుఁ దెల్పుమాయనన్.*

## భావము

మహాగృహస్థుఁడును, శునకుఁడను వాని పుత్రుఁడును నగు శౌనకుఁడును మహర్షి భారద్వాజ శిష్యుఁడగు అంగిరసుఁడును ఆచార్యుని కడకు, నాచార్యుని సమీపించునపుడు శిష్యుఁడు విధివిధానముగా నెట్లు రావలయునో ఆవిధముగా వచ్చి ''మహాత్మా! ఏ వస్తువు నెరిగిన యెడల తెలుసుకొనఁదగిన దంతయుఁ జక్కఁగాఁ దెలుసుకొనఁబడునో అట్టి వస్తువునుపదేశింపుడని యడిగెను.

ప్రాచీన కాలమున వైరాగ్య భావ పరిపూరుఁడగు శిష్యుఁడు సమిధలను జేతఁ బట్టుకొని గురువు నాశ్రయించెడి వాడు. సమిధలు హోమాగ్నిలోఁబడి భస్మమగు రీతి తనలోని యజ్ఞానము గురుముఖపద్మము నుండి వెలువడు జ్ఞానాగ్నిలోఁబడి దగ్ధముగావలయునను భావమే యిందలి అంతరార్థము.

## 4 – వ మంత్రము

తస్మై సహోవాచ- ద్వేవిద్యే వేదితవ్యే ఇతి హస్మయద్
బ్రహ్మవిదో వదన్తి, పరా చైవా పరాచ 4

గీ. శౌనకుండిట్లు ప్రశ్నింప నంతనమున నంగిరసుఁడు వాక్రుచ్చెను
సాదరమున వినెదము పరావిద్య అపరావిద్య బ్రహ్మవేత్తలు చెప్పంగఁబరగ రెండు.

### భావము

శాస్త్రనియమముల ననుసరించి తనసమీపమునకు వచ్చి జిజ్ఞాసువయి ప్రశ్నించినశౌనకునకు నంగిరసుడిట్లు సమాధానముఁ జెప్పెను. వేదార్థము నెరిగి పరమార్థమును బాగుగాఁ దెలుసుకొనిన బ్రహ్మవేత్తలు 'పర' – అనియు 'అపర' – అనియు పేరుగల రెండు విద్యలు గలవని తెలిపెదరు. వానినిఁదెలుసు కొనవలయునని పలికెను. 'పరా' విద్య యనగా పరమాత్మను గూర్చి బోధించునట్టి విద్య' 'అపరా' – యనగా ధర్మా ధర్మసాధనములను, తత్ఫలములను బోధించునటిలు విద్య.

## 5 – వ మంత్రము

తత్రాపరా, ఋగ్వేదో యజుర్వేదః
సామవేదో౽ ధర్వవేదః శిక్షాకల్పో
వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి
అథపరా, యయా తదక్షర మధిగమ్యతే॥ 5

## 6 – వ మంత్రము

యత్ తద ద్రేశ్య మగ్రాహ్యో మగోత్రమవర్ణ
మచక్షుః శ్రోత్రం తదపాణి పాదమ్
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం
యద్భూత యోనిం పరిపశ్యంతి ధీరాః 6

సీ. ఎఱిగింతు వినుమయ్య యీ రెండు విద్యలం
దున నపర విద్యలనగఁ బరగు
నాల్గువేదంబులు నయమొప్ప శిక్షయుఁ
గల్పంబు మరియు వ్యాకరణమనగ
సరిగ నిరుక్తంబు ఛందస్సు జ్యోతిషం
బనెడి వేదాంగం బులన్ని మహిని
కన్నుల కెయ్యది కనుపింప కుండునో
వెనమది గ్రహియింప వీలుపడదొ?

గీ. ఏది పుట్టుక లేనిదో ఏది రంగు
లేనిదో కాళ్ళుచేతులు లేనిదేదొ?
కానఁ గన్నులు గర్ణముల్ లేనిదేదొ?
నిత్యమగునేదొ? సర్వంబు నేదితాల్చు?

గీ. అవ్యయం బెయ్యది? సకల వ్యాప్తమేది?
అఖిల జగముల కాధారమైన దేది?
సూక్ష్మతరమగు దానినిఁ జూడఁగలరు
ధీరు లంతట నీ విశ్వకారణముగ.

## భావము

పరాపర విద్యల యొక్క వివరములు చెప్పఁబడు చున్నవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అనెడి నాలుగు వేదములు, శిక్షా, వ్యాకరణము కల్పము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, అనుషడంగములు అపరా విద్యకు సంబంధించినవి. అక్షర పరబ్రహ్మము నందించు విద్యయే పరా విద్య.

ఏది చూచుటకు నలవి కానిదో, మనస్సుచే గ్రహించుటకు వీలుకానిదో, పుట్టుక లేనిదో, వర్ణములు లేనిదో సకల ప్రాణులకు నామరూపాది విషయములను, గ్రహింపఁజేయునట్టి కన్నులు, చెవులు, అను నింద్రియములు లేనిదో, చేతులు పాదములు లేనిదో వినాశము లేనిదో, బ్రహ్మాది

స్థావరాంతభేదముల చేత వివిధముగా నగుచున్నదో, ఆకాశము వలె నంతట వ్యాపించి యున్నదో, సూక్ష్మతరమో, అవ్యయమైనదో సకల భూతములకుఁ గారణ భూతమైనదో అట్టి అక్షర తత్త్వమును ధీరపురుషులు సర్వత్ర దర్శింతురు.

## 7 – వ మంత్రము

యథోర్ణనాభిః సృజతే గృహతే చ
యథా పృథివ్యా మోషధయః సంభవంతి
యథా సతః పురుషాత్ కేశలోమాని
తథాక్షరాత్ సంభవతీహ విశ్వమ్॥ 7

గీ. తన శరీరము నందుండి తనకుఁదానె
సాలె గూడును సృజియించి సరిగ మరల
కాయమున- దాని సాలీడు కలుపుకొనునొ
అటులె అక్షరంబున జగమంత పుట్టు.

గీ. భూరివిని నోషధులే రీతిఁ బుట్టు చుండు
జీవితుండగు మనుజుని శిరము పైన
తనువుపై వెంట్రుకల్ వెర్గుననువు మీర
నటులె యక్షరంబున జగమంత పుట్టు.

### భావము

లోకమున సాలెపురుగు సాలెగూడును ఏ విధముగా తన శరీరము నందుండి సృజించుకొనుచు మరల తన లోనికిఁ దీసుకొనుచున్నదో భూతలముపై వ్రహ్యోద్యోషధులు ఏవిధముగాఁ బుట్టుచున్నవో, చేతనుఁ డగు మానవుని శిరము మీద కేశము లెట్లు పుట్టుచున్నవో అటులనే యీ యక్షర తత్త్వము నుండి యీ జగత్తు జనించు చున్నది.

# 8 – వ మంత్రము

తపసా చీయతే బ్రహ్మ తతోஉన్నమభి జాయతే
అన్నాత్ ప్రాణో మనః! సత్యం లోకాః కర్మసు చామృతమ్ 8

గీ. తపములో నున్న బ్రహ్మము దగగఁ బెరుగు
బ్రహ్మనుండి యన్నంబును బాగఁ బుట్టు
అన్నమున నుండి ప్రాణంబు నెన్న మనము
సత్యమైనవి లోకముల్ సరిగ కర్మ
లధిక కర్మఫలావళి యరయఁగలుగు.

## భావము

భూత యోనియు, అక్షరాఖ్యము నగు బ్రహ్మము జగత్తు నుత్పత్తి చేయవలయునను సంకల్పమును జ్ఞానము చేత అంకురావస్థను బొందఁ బోయెడి బీజము వలె పుత్రసందర్శనము వలన ప్రవృద్ధిఁజెందెడి తండ్రివలె వృద్ధి చెందుచున్నది. సృష్టి,స్థితి,సంహారక శక్తి విజ్ఞానములు కలుగుట చేత ప్రవృద్ధిచెందిన ఆ బ్రహ్మము నుండి అన్నము అనగా అవ్యాకృతము అనగా ప్రపంచమును సృజింప వలయు ననెడి యిచ్ఛాశక్తి పుట్టుచున్నది. ఇట్టి అవ్యాకృతావస్థయగు అన్నము నుండి ప్రాణము అనగా హిరణ్యగర్భుఁడు పుట్టుచున్నాడు. హిరణ్యగర్భుఁడు బ్రహ్మ యొక్క జ్ఞాన క్రియాశక్తుల చేత అధిష్ఠింపఁబడిన జగత్తునకు సాధారణమయిన అవిద్యా కామ కర్మ భూత సముదాయమునకు బీజాంకురమై, జగదాత్మమై, వెలయుచుండును. ఇట్టి హిరణ్యగర్భుని నుండి సంకల్ప వికల్ప సంశయ నిర్ణయము లేని స్వరూపముగాఁగల సమిష్టి రూపమైన మనస్సు పుట్టెను. మనస్సునుండి సత్యమను పేరుగల ఆకాశాది పంచభూతములు జనియించెను. సత్యాఖ్యమగు పంచభూతముల నుండి అండక్రమముగా భూరాదిలోకములును, అందుండి మనుష్యాది ప్రాణులును, వర్ణాశ్రమములును, ఆశ్రమానుసారము కర్మలును, ఆకర్మల నుండి అమృతమును పేరుగల కర్మనుండి జనించిన ఫలము కల్పకోటి శతములు గతించినను అనుభవించినఁ గాని నశించదు కనుక అమృతము చెప్పబడినది.

# 9 – వ మంత్రము

యః సర్వజ్ఞః సర్వవిద్ యస్యజ్ఞాన మయంతః
తస్మాదేతద్ బ్రహ్మ నామ రూపమన్నంచ జాయతే॥

గీ. ఎవడు సర్వజ్ఞుఁడో జ్ఞాన మెవని తపము
సర్వ విదుఁ డెవ్వడో వాని శక్తి నుండి
బ్రహ్మయును నామ రూపముల్ పరగఁబుట్టె
నన్నమావిర్భవించెను సన్నుతముగ.

## భావము

అగ్రాహ్యాది లక్షణ విశిష్టమగు నక్షర బ్రహ్మము సర్వజ్ఞము సర్వవిత్తు, ఆ బ్రహ్మము యొక్క తపస్సు జ్ఞానవికారమగు సర్వజ్ఞతయే. లక్షణముగా గలది కాని యితరుల తపస్సు వలె ఆయాస లక్షణమయినది కాదూ. అట్టి సర్వజ్ఞమైన అక్షర పరబ్రహ్మము నుండి కార్య రూపమగు వారణ్య గర్భాఖ్యమగు బ్రహ్మమును దేవదత్త, యజ్ఞదత్తా ది నామములును తెలుపు, ఎరుపు, నలుపు, మున్నగు రూపములును, వ్రీహి యవాది లక్షణమగు నన్నమును పూర్వమంత్రోక్తక్రమముననుసరించి పుట్టుచున్నది.

ఇది ప్రథమ మండకములో ప్రథమ ఖండము.

# ప్రథమ ముండకము

## ద్వితీయఖండము

### 1వ. మంత్రము

తదేతత్ సత్యం మన్త్రేషు కర్మాణి కవయో
యాన్య పశ్యం స్తాని త్రేతాయాం బహుధాసన్తతాని
తాన్యాచరథ నియతం సత్యకామా
ఏష వః పంథాః సుకృతస్య లోకే॥

మ. శ్రుతి మంత్రంబులనేసు కర్మలను సచ్ఛ్రేయంబు లాశించి సం
తత దీక్షా విధిఁజూచిరో ఋషులు సత్యం బుల్ గదా: అన్నియున్
క్షితిఁద్రేతాయుగమందు నియ్యెవి తగన్ సేవ్యంబు లయ్యెన్ మహా
వ్రతులై సల్పుడు మీరు పుణ్యముల సంపాదింప మార్గంబిదే.

### భావము

మేధా వంతులగు వశిష్ఠాది మహర్షులు ఋగ్యజుస్సామ మంత్రములందు ఏ అగ్ని హోత్రాది అనేక విధములగు కర్మలను జ్ఞాన దృష్టిచేతఁ గన్నుగొనిరో ఆ కర్మలను త్రేతాయుగమందు ననేక విధములుగా నాచరింపఁబడినవి, సత్య ప్రియులై నిత్యము ఆ కర్మల నాచరించుఁడి

### 2. మంత్రము

యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే
తదాజ్య భాగావంతరేణా హుతీః ప్రతిపాదయేత్.॥ 2

గీ. మహిత హోమాగ్ని చక్కఁగా మండుచుండ జ్వాల లెగయుచుఁగ
దలుచు సాగుచుండ నగ్నులకు రెండు భాగాల కచట మధ్య
నాహుతుల సమర్పించుట యర్థమగును.

### భావము

సమిధల చేత నగ్నిహోత్రము ప్రజ్జ్వలింపఁజేయఁబడగా, నా యగ్ని జ్వాలలెపుడు చలించుచుండునో అపుడాజ్యభాగముల యొక్క మధ్యభాగమునందు నగ్నిహోత్రాహుతులను హోమము చేయవలయును. కర్మలను శ్రద్ధా భక్తిపురస్సరముగా నాచరించిన యెడల శ్రద్ధోఁజేసినట్లగును.

## 3వ మంత్రము

యస్యాగ్ని హోత్ర మదర్శ మపౌర్ణ మాస
మ చాతుర్మాస్య మనాగ్రయణ మతిధి వర్జితంచ
అహుతమ వైశ్వదేవ మవిధి నాహుత
మసప్తమాం స్తస్య లోకాన్ హినస్తి॥

సీ నిత్యాగ్ని హోత్రి యో నిష్ఠాన్వితుఁడు దాన
మావాశ్యనాడు హోమంబునందు
నగ్నిహోత్రుని భక్తి నర్చించి విధ్యుక్త
సత్కర్మ లన్నింటి సలుప జేసి
పున్నమి నాడశ్ర పూజ్య కర్మంబులఁ
బ్రీతి సద్విధి నాచరింపడేని
కర్మిష్ఠియౌమఁ జాతుర్మాస్య సద్వ్రతం
బింపుగాఁదగ నాచరింపడేని.

గీ. క్రమముగా నూర్పుడులఁజేయు కర్మలెల్ల
నతిథు లెవ్వరు లేకున్న నా చరించు
కర్మలను వైశ్య దేవపు కర్మలెల్ల
సలుపకున్న . హుతుల శాస్త్ర విధిని.

గీ. యజ్ఞము . . సల్ప నాయజ్ఞ మహిత మగుచు
యజ్ఞ కర్తకు నెంతయో హానిఁ గూర్చు
సప్త లోకంబులన్ వినాశంబు ఁ జేయు
ధరని నుత్తమ గతులెల్ల ధ్వంసమగును.

## భావము

అగ్ని హోత్రియగువాడు కల్పసూత్రము లందు నా యా కాలములందు ఁజేయవలసినదిగా విధించిన ధర్మ యాగము, పౌర్ణ మాసయాగము, చాతర్మా స్య యాగము ఆగ్రయణము మొదలగు కర్మలను చేయవలయును. ప్రతి నిత్యము తన గృహమునకు వచ్చునతిథులను శక్తి వంచన లేకుండా

పూజింపవలయును. సాయంప్రాతః కాలములందు వైశ్య దేవ మొనర్చవలయును.

శాస్త్ర విధి ననుసరించి సకాలమునఁ జెప్పిన ద్రవ్యముతోఁ జేయవలయును. శాస్త్రవిధి నీతి క్రమించినచో భూరాది సప్తలోకములు నశించిపోవును. తన పితృ దేవతల యొక్కయు, పౌత్ర ప్రపౌత్రుల యొక్కయు ఐహికాము ష్మి కాభివృద్ధిని నశింపజేయుచున్నవి. కావునఁ గర్మల నశాస్త్రీయముగాఁ జేయరాదు.

## 4 వ మంత్రము

కాళీ కరాళీచ మనోజవాచ
సులోహితా యాచ సుధూమ్ర వర్ణా
స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ
లేలాయ మానా ఇతి సప్త జిహ్వాః!!

గీ నుడువ కాళీ, కరాళీ, మనోజవా అ
తులమయిన సులోహితయు సుధూమ్రవర్ణ
విమలమైన స్ఫులింగినీ విశ్వరుచియు
ననగ సప్త జిహ్వాలలరు నగ్ని కెపుడు.

## భావము

కాళీ, కరాళీ, మనోజవా, సులోహిత, సుధూమ్ర వర్ణా, స్ఫులింగినీ, విశ్వరూపయను పేరుగల సప్త జిహ్వాలు అగ్ని హోత్రునకుఁ గలవు. ఈ ఏడు జిహ్వాలతో నా యా కర్మలందు యజమాను లొసంగు ఆహుతులను అగ్నిహోత్రుఁడు గ్రహించును.

## 5 వ మంత్రము.

ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు
యధాకాలం చాహుతయో హ్యాద
తం నయంత్యేతాః సూర్యస్య రశ్మయో
యత్రదేవానాం పతి రేకోఽధి వాసః!! 5
భ్రాజమానంబులైన నీ జ్వాలలందు

స్వర్గసమయంబు నందున నాహుతులను
వేయ నవి సూర్యకరములై విబుధవిభుని
కడకుఁ గొంపోవు సకల సౌఖ్యంబులిచ్చు.

## భావము

దేదీప్యమానములగు కాలి, కరాలీ, మున్నగు అగ్నియొక్క జిహ్వాలందు నెవడు ఆయా కర్మలకు విధించిన కాలము నందు నాహుతులను హోమము చేయుచున్నాడో ఆయాహుతులు సూర్యకిరణములుగాఁ బరిణమించినవై ఏ స్వర్గలోకము నందు దేవేంద్రుఁడొక్కడే అందరకుఁ బెద్దగా నుండునో అట్టి స్వర్గలోకమునకు యీ యజమానినిఁ జేర్చుచున్నవి.

## 6 వ మంత్రము

ఏ హ్యేహీతి తమాహూతయః సువర్చసః
సూర్యస్యరశ్మిభిర్యజమానం వహన్తి
ప్రియాం వాచమభి వదంత్యో ఽర్చయంత్య
ఏషవః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః!!

గీ ప్రియవచనములఁ బలుకుచుఁబ్రీతిఁ గూర్చు
చాహుతులు దీప్తివంతంబులగుచుఁ బలుకు
''రండు'' ''రండు'' త్వత్పుణ్య సంప్రాప్తమైన
బ్రహ్మలోకమియ్యదెయని భాను కిరణ
ముల పయిని యజ్ఞకర్తఁ గొంపోవుఁబైకి.

## భావము

అగ్నిహోత్రు చేత నాయాకాల మతిక్రమించకుండా హోమము చేయఁబడగా నాయాహుతులు మిగుల ప్రకాశించు చున్నవై ఇహలోక యాత్ర చాలించి, ఆముష్మికసుఖముల నభిలషించిన యీ యజమాని నెదుర్కొని ప్రియ వచనములు పలుకుచు, అర్చించుచు మీ పుణ్యార్జితమైన పవిత్రమైన బ్రహ్మలోక మిదియేయని తెలుపుతు, కొనియాడుచు, రండి! రండి! అని ఆహ్వానించుచు యజమానిని సూర్య కిరణాల ద్వారా స్వర్గమునకుఁ దీసుకొని పోవుచున్నవి.

## 7 వ మంత్రము

ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్త మవరం యేషు కర్మా
ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా
జరామృత్యుం తే పునరేవాపి యంతి!!

గీ అపరమగు కర్మ మష్టా దశాంగమయిన
యజ్ఞకర్మలె యాధారమగుచు నుండు
తెలియనివి యదృఢంబగు తెప్పలౌర !
అధము లిదియె శ్రేయో మార్గమనుచు నమ్మి
మరల నందెదరిల జరా మరణములను

## భావము

అపరమైన కర్మ పదునెనిమిది అంగాలతోఁ గూడిన యజ్ఞ కర్మలపైని నాధారపడియుండును. ఈ కర్మలన్నియు నిజమునకు బలహీనమైన తెప్పల వంటివే. ఈ కర్మల వలన గలుగు ఫలము నిస్సారముయినది. వీని వలన శ్రేయోరూపమగు మోక్షము లభించునని వివేకరహితులగునే యజ్ఞానులు దలంచుచున్నారో వారు తప్పక జరామరణములఁ బొందుచుఁగొంతకాలము స్వర్గాది పుణ్యలోక సౌఖ్యముల ననుభవించి పుణ్య ఫలానుభవానంతరము తిరిగి పుట్టుచు గిట్టుచు నిట్లు సంసార చక్రమునఁ బరిభ్రమించు చున్నారు.

## 8. వ మంత్రము.

అవిద్యయా మంతరే వర్తమానా:
స్వయం ధీరా: పండితం మన్యమానా:
జంఘన్యమానా: పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యథాందా:!!

మ జనులజ్ఞానపు కర్మమార్గమున సంచారంబు గావించుచున్
ఘనధీగాత్ములమంచు బ్రజ్ఞులన బ్రాగల్భ్యంబుతో నాత్మకీ
ర్తనముల్ సల్పుచు దుఃఖ పీడితులునై మూర్ఖత్వంబునన్ గ్రుడ్డివా
నిని నూతన్ గొని తిరు నంధులన వేనిన్ జూడలేరెంతయున్

## భావము

మూఢులగు ఆత్మస్తుతి పరులు గొందరు అజ్ఞానులై యున్నను తామే జ్ఞానులమనియు తెలియఁదగిన సకల విషయములు తమకే సంపూర్ణముగాఁ దెలియునని తామే ధీరపురుషులమని, ప్రజ్ఞావంతులమని తలంచుచు జరామరణ రోగపీడితులై పుట్టుచు గిట్టుచు గ్రుడ్డివానిచే నడిపింపఁబడు గ్రుడ్డివారివలె దిక్కుతోచక యీ సంసార చక్రము నందు పరిభ్రమించు చుందురు.

## 9వ మంత్రము.

*అవిద్యాయాం బహుధా వర్తమానా*

*వయం కృతార్థా ఇత్యభి మన్యంతి బాలాః*

*యత్కర్మిణో నప్రవేదయంతి రాగాత్*

*తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే!!*

*మ. ధరనజ్ఞానముతో జరించుచు సత్యం బైన జ్ఞానంబు దా*

*మెరుగన్ జాలరు మూర్ఖులర్భకులుగా నిష్టార్థముల్ గోరుచున్*

*మరి భావింతు రయో కృతార్థులుగ సన్మాన్యంబులౌ పుణ్యముల్ దరగన్ గ్రందికి జారి*

*చేరెదరు వ్యర్థంబుల్ గదా! కర్మముల్.*

## భావము

మూఢులు గొందరు తామ జ్ఞాన రూపమైన ప్రపంచము నందు దేవమనుష్య తిర్యగాది వివిధ వేషములతో బహువిధముల సంచరించుచుఁ దామే కృతార్థులమని భావించు చున్నారు. వీరు కర్మఫలము వలన సంప్రాప్తించెడి స్వర్గ సుఖము నందుఁగల మక్కువతో నిట్టి సత్యమును గ్రహించఁజాలకున్నారు. అందువలన పుణ్య లోక సుఖముల ననుభవించిన వారలై కర్మ ఫలము క్షీణమయిన పిదప మరల స్వర్గలోకమునుండి క్రిందికి జారి పడుచున్నారు.

## 10 వ మంత్రము

*ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం*

*నన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః*

*నాకస్య పృష్ఠేతే ను భూత్వేమం*

*లోకం హీనతరం వావిశంతి!!*

మ. వర యజ్ఞంబులు పుణ్య కార్యములు సంభావ్యంబు లంచున్ మదిన్
స్థిర సంకల్పము దోడ నెంచెదరు సచ్ఛ్రేష్టంబులౌ వారికిన్
బరిశీలింపరు సత్యమార్గములనా స్వర్గంబునన్ సౌఖ్యముల్
పరిపూర్ణింబుగ బొంది చేర గల రల్పంబైన లోకంబులన్.

## భావము.

దారాపుత్ర పశుధన క్షేత్రాదు లందు వ్యామోహముచే ప్రమత్తు లగు కొందరు మూఢులు ఇష్ట పూర్తాది కర్మలనాచరించుటయే శ్రేష్ఠమైన పురుషార్థముగాఁ దలంతురు. పరమ పురుషార్థ సాధనమయిన ఆత్మజ్ఞానమును వారెరుంగఁ జాలరు. ఇష్టపూర్తాది కర్మలనాచరించుటయే పరమ పురుషార్థముగాఁదలంచు జ్ఞానులు కర్మఫలమనుభవించుటకు స్థానభూతమగు స్వర్గలోకము నందు కర్మ ఫలాను రూపమగు సుఖమను భవించి తదనంతరము కర్మఫలము యొక్క శేషము ననుసరించి యీమానుష లోకమునఁ గాని యింత కన్న హీనమగు పశు పక్ష్యాది లోకమునుఁ గాని పొందెదరు.

## 11 వ మంత్రము

తపః శ్రద్ధేయేహ్యుప వసంత్యరణ్యే
శాంతా విద్వాంసో భైక్ష్యచర్యాం చరంతః
సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి
యత్రామృతః సపురుషో హ్యవ్య యత్మా॥॥

సీ. శాంత చిత్తులు సత్య సౌజన్య మూర్తులు విద్వాంసు లెవ్వారు విపిన వీధి
భిక్షాన్నమును గొంచు విమలవకా పావన జీవనం బచ్చోటఁ
జేయుచుండి పరిశుద్ధులౌచుఁదపం బొనరించుచు
నుందు రోహారలానంద మొప్ప సత్పవిత్రులగుచు సౌరమార్గంబునఁ
గ్రమముగా బ్రహ్మలోకంబుఁజేరి

గీ. అచట బ్రహ్మోపదేశంబు నధిక రక్తి
శ్రవణ మొనరించి కల్పాంత సమయ
బ్రహ్మతోడ నక్షర పరబ్రహ్మతత్త్మ
మందుఁ జేరెద రానంద మందు చపుడు.

## భావము

ఎవరరణ్యము నందు అనగా స్త్రీజనాకీర్ణముగాని ప్రదేశము నందు నివసించుచు నింద్రియ చాపల్యమును జయించి తమయాశ్రమ కర్మల ననుష్ఠించుచు, భిక్షాటన మొనరించుచు, తపస్సు శ్రద్ధలతో జీవితము సాగించు చుందురో అట్టి శాంతమనస్కులు, విద్వాంసులు నశించిన పుణ్యపాప కర్మలు గలవారై సూర్య ద్వారమార్గము అనగాఅర్చిరాది మార్గము చేత అవ్యయుఁడును అమృతుఁడును, నగు హిరణ్యగర్భుఁడుండు సత్యలోకాదికమును బొందుదురు.

## 12వ మంత్రము

పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రహ్మణో
నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన
తద్విజ్ఞానార్థం సగురు మేవాభి గచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం॥

గీ. అరయ కర్మ సంప్రాప్తంబులైన వివిధ
లోకములఁ బరీక్షించినఁ బ్రాకటముగ
నిత్యమగునది కర్మల సత్యముగను
పొందలేమని తెలియును బుధులకంత

గీ. పరగఁ గర్మలన్నియును నిష్ఫలములను చుఁ
దలచుచును ముముక్షువు పరతత్త్వమెఱుగ
శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుఁడౌశుద్ధ చరితు
భక్తిఁజేరవలయు సమిత్పాణి యగుచు.

## భావము

కర్మలానరించుటచే లభించెడి లోకాలను పరీక్షించిన పిదప నిత్యమైనది కర్మల ద్వారా పొందఁబడునది కాదని ముముక్షువు కర్మల పై నైరాశ్యమును బొందవలయును. పరతత్త్వమును దెలిసి కొనుట కతడు సమిధులను జేతఁబట్టుకొని శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుఁడైన ఆచార్యుని మాత్రమే సమీపించి ఆశ్రయించవలయును. సమిధలను జేతఁబట్టుకొని వైరాగ్యసంపన్నుఁడై తత్త్వవిజ్ఞానార్థియై వచ్చిన
4. శిష్యునికి గురువు బ్రహ్మ విజ్ఞానోపదేశ మొనరింపవలయునని అంగిరస మహర్షి తెలియఁ జేసెను.

## 13వ మంత్రము

తస్మై స విద్వానుప సన్నాయ సమ్యక్
ప్రశాంత చిత్తాయ శమన్వితాయ
యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యాం॥

గీ. బ్రహ్మవిదుఁడగు నా గురువర్యుఁడంత
శమదమాన్వితుఁబరిశుద్ధు శాంత చిత్తు
భక్తి శాస్త్రోక్త రీతిని వచ్చినట్టి
శిష్యునకు బ్రహ్మ విద్యను జెప్పవలయు.

## భావము

ఆ విధముగా శాస్త్రోక్తమైన విశిష్ట సత్సంప్రదాయానుసారముగా గురూపసదన మొనర్చినవాడును, ప్రశాంత చిత్తుఁడును శమాన్వితుఁడును నగు శిష్యునకు బ్రహ్మవిదుఁడైన గురువు సత్యస్వరూపము, అక్షర విద్యయునైన బ్రహ్మవిద్యను బోధింపవలయును.

## ఇది ప్రథమ ముండకములో ద్వితీయ ఖండము

## ద్వితియ ముండకము

### ప్రథమ ఖండము

తదేతత్ సత్యం యథా సదీప్తాత్
విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతె
తథాక్షరాద్ వివిధాః సౌమ్య భావాః
ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి॥

సీ. సత్యమౌ విషయంబు సౌమ్యుఁడా వినుమయ్య
పరమార్థమియ్యది భవ్యమతము

సందీప్త పావక జ్వాలల జనియించి
విస్ఫులింగంబులు వేనవేలు
ప్రస్ఫుటంబుగ నగ్నితత్త్వంబుతో నొప్పి
పై కెగసి మరలఁబడెడి రీతి నక్షర బ్రహ్మంబు
నందుండి నిత్యంబు భువిలోన జీవులు పుట్టుచుండు.

గీ. అక్షర బ్రహ్మముందునే యలరు చుండు
జీవులందు జీవత్త్వము చెలగిపోవ
నవియె బ్రహ్మమునందైక్య మందుఁదిరిగి
సత్యమక్షర తత్త్వంబు జగతిఁజూడ

## భావము

ఓ సౌమ్యుఁడా! ఇదియే సత్యము బాగుగా మండుచున్న అగ్నిహోత్రమునుండి, సమానమయిన రూపములు గల అగ్నికణములు వేలకొలది ఏ విధముగా జనించునో అదే విధముగా నక్షర పరబ్రహ్మము నుండి నానా విధములగు జీవులు ఉద్భవించుచున్నవి, మరల నాయక్షరమగు పరబ్రహ్మము నందే లీనమగు చున్నవి.

## 2 వ మంత్రము

దివ్యోహ్యమూర్తః పురుషః
స బాహ్యాభ్యంతరోహ్యజః
అప్రాణోహ్యమనాః శుభ్రో
హ్యక్షరాత్ పరతః పరః

గీ. బాహ్యమందున మరియు నభ్యంతరమున
నుండి యక్షరాతీతమై యుండునదియు
స్వప్రకాశంబు శుద్ధమప్రాణ మజము
మనము రూపము లేకయే మహిత
పురుషుఁడంతట నిండి తాఁబొసగుచుండు

## భావము

ఈ యక్షర స్వరూపుడు దివ్యుఁడు. దివ్యుఁడనగా స్వయముగాఁబ్రకాశించువాడు, అమూర్తుఁడు అనగా సర్వవిధమూర్తిరహితుఁడు, పురుషుఁడు. పురుషుఁడనగా పూర్ణుఁడు లేక హృదయగుహయందు నివసించువాడు బాహ్యాభ్యంతరములతోఁజేరి యుండువాడు, అజుఁడు అనగా పుట్టుకలేనివాడు, అజుఁడు, అజరుఁడు అమృతుఁడు, అక్షయుఁడు, ధ్రువుఁడు, అభయుఁడు, దేహాద్యుపాధి దృష్టిగల వారలకు నవిద్యావశమున స ప్రాణుఁడుగఁ గనఁబడినను పరమార్థ దృష్టిగల వారికి అప్రాణుఁడుగ అనగా క్రియాశక్తి భేదమగు చలనాత్మక వాయువు లేనివానిగాఁ గనిపించును. అనేక విధ జ్ఞానశక్తి భేదములు గలదియు, సంకల్ప వికల్పాద్యాత్మకమును నగు మనశ్చలనము లేనివాడు, ఇట్లుపాధి భేదమును నిషేధించుట చేత అద్వయుఁడును, అందువలననే శుభ్రుఁడును, సర్వకార్యకారణ బీజముగాఁగ నంబడుచున్న నామబీజోపాధి లక్షిత స్వరూపము కంటే వేఱయిన వాడును అనగా నిరుపాధికుఁడని యర్థము.

## 3వ మంత్రము

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రి ఖం యాణిచ
ఖం వాయుర్జ్యోతి రాపః యాణిచ పృథివీ విశ్వస్య ధారిణీ॥ 3

గీ. అట్టి శుద్ధచైతన్యంబు నందుఁబుట్టు
వరుస సర్వేంద్రియంబులు ప్రాణమరయ
మనము పంచభూతంబులు ననగ భూమి
నీరు నగ్ని వాయువు నింగి తెలియు.

## భావము

ఈ పరమ పురుషుని నుండి అవిద్యా విషయ వికార భూతమును, అనృతాత్మకమును, నగు ప్రాణము పుట్టుచున్నవి. మనస్సును, సర్వేంద్రియములును, ఇంద్రియ విషయములను బుట్టుచున్నవి. శరీరోత్పత్తికిఁగారణ భూతమగు ఆకాశము, ఆవహప్రవాహాది భేదములు గల వాయువు అగ్ని, జలము. ప్రపంచము నంతటిని ధరించు పృథివియుఁబుట్టెను. ఆకాశమునకు శబ్దగుణము, వాయువునకు శబ్దస్పర్శ గుణములు, అగ్నికి శబ్ద, స్పర్శ, రూప, గుణములు, జలమునకు శబ్ద, స్పర్శ, రూప, రసగుణములు, పృథివికి శబ్దస్పర్శ, రూప, రస, గంధగుణములున్నవి.

## 4వ మంత్రము

అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశః శ్రోత్రేవాగ్ వివృతాశ్చవేదాః
వాయుః ప్రాణోహృదయం విశ్వమస్య
పద్భ్యాం పృధివీ హ్యేష సర్వభూతాంత రాత్మా॥ 4

సీ. ఆశుద్ధ చైతన్యమంతటి కాధార
మది విశ్వరూపమై యలరు చుండు
నా విరాడ్రూపమే యంతయు మూర్ధంబు దేవలోకంబు సందీప్త
మగుచు సూర్యచంద్రులు చూడ సొంపైన నేత్రముల్ దిక్కులు
చెవులగు తెలిచియున్న
నోరగు వేదముల్ మారుతం బాయువు
విశ్వంబు హృదయంబు విలసితముగ

గీ. పాదముల నుండి జనియించె వసుధ యంత
సకల భూతాంత రాత్మయీ సర్వయంత మదియు
రూపమద్వయ సత్తా స్వరూప మదియె
అక్షరపరబ్రహ్మంబును నధిగమించు.

## భావము

ఈ విరాట్పురుషునకు ద్యులోకమే శిరస్సు. సూర్యచంద్రులే నేత్రములు, దిక్కులే శ్రోత్రములు, వేదములే తెలిచియున్న నోళ్ళు. వాయువే ప్రాణము, జగత్తంతయు హృదయము, ఆమహాపురుషుని పాదములనుండి భూమి పుట్టినది. ఈ దేవుఁడే సర్వభూతములకు అంతరాత్మయగుచున్నాడు. ఇతడే సర్వభూతముల యందు ద్రష్టయు శ్రోతయు, మంతయు, విజ్ఞాతయునై యున్నాడు.

## 5 వ మంత్రము

తస్మాదగ్నిః సమిధో యస్య సూర్యః
సోమాత్ పర్జన్య ఓషధయః పృథివ్యాం
పుమాన్ రేతః సించతి యోషితాయాం

బహ్వీ ప్రజాః పురుషాత్ సంప్రసూతాః

సీ. సూర్యుఁడు సమిధగా శోభిల్లు దేవలోకము దొలియగ్నియై క్రాలు చుండు
సురలోకమందునశోభిల్లు చంద్రుని కతమున వర్షమేఘములు గలిగె
నిది ద్వితీయాగ్నిగా నింపెసలారును వర్షింప మేఘముల్ వసుధపైన
తరువులు నోషధుల్ పెరుగుఁ దృతీయాగ్నియయ్యెనవిధర నాహార మయ్యె

గీ. బురుషులకు జతుర్థాగ్నియౌ భువిని మిగుల
తరుణియందు ( బురుషుడు రేతస్సునుంచ
పంచమాగ్నియై మహినిది పరిఢవిల్లు
ప్రభవమందును దానిచే ( బ్రాణికోటి.

## భావము

సూర్యునిచేత ద్యులోకము ప్రకాశింపఁజేయఁబడుచున్నదను విషయము సుప్రసిద్ధమేకదా! దేవలోకమనెడి అగ్నికి సూర్యుడు సమిధయైనాడు. ఆద్యులోకాగ్ని నుండి జనించిన సోముని వల్ల నుండి పర్జన్యుఁడను ద్వితీయాగ్ని పుట్టుచున్నది. ఆ పర్జన్యాగ్ని వలన భూమియందు ఓషదులను మూాడవయగ్ని పుట్టుచున్నది. పురుషాగ్నియందు హుతమొనరింపఁబడిన ఓషధుల నుండి పురుషాగ్ని, ఓషధుల నుండి పరిణమించిన రేతస్సును యోషిత్తను అగ్నియందుంచు చున్నాడు. అనగ ఆ పురుషుఁడు స్త్రీయందు రేతఃపాతము చేస్తాడు. దానినుండి ఎన్నో జీవులు పరమ పురుషుని నుండి ఉద్భవించుచున్నవి.

## 6 వ మంత్రము

తస్మాదృచః సామ యజూంషి దీక్షా
యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ
సంవత్సరశ్చ యజమానశ్చలోకాః
సోమో యత్ర పవతే యత్ర సూర్యః ॥

సీ. భువిలోన జీవులు పుట్టినంతనె చతుర్విధ ఫలపురుషార్థ విమల సిద్ధి
గూర్పంగ వేదఋక్కులు సామగానముల్ సద్యజస్సులును దీక్షలు గ్రమాన
యజ్ఞముల్ గ్రతువులు యజ్ఞదక్షిణలు వర్షములు కర్మలు శుభవ్రతములెల్ల
యజ్ఞములొనరింప యజమాని యందుండి క్రమముగా బుట్టె జగత్తుపొడమె

గీ. పగటి కాలము నందున భాస్కరుండు
రాత్రివేళల జంద్రుండు రమ్యరీతి
వెలుగులను నింపి జగముల వెలుగ (జేసి
సత్పవిత్రముఁ జేయఁగ జక్కగాను.

## భావము

ఆ పరమ పురుషుని నుండి వేదఋక్కులు సామగానములు, యజుస్సులు, వ్రతదీక్షలు, అగ్నిహోత్రాది సకల యజ్ఞములు, క్రతువులు, యజ్ఞదక్షిణలు, యజ్ఞసమయము, కర్మాంగకాలము, కర్తయగు యజమాని, సూర్యచంద్రులు, పునీతం చేయులోకాలు జనించినవి.

## 7వ మంత్రము

*తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః*
*సాద్యా మనుష్యాః పశవో వ యాంసి*
*ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ*
*శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ ॥7*

గీ *శుద్ధ చైతన్యమున నుండి సురలు సాధ్యు*
*లవని మానవుల్ పశు పక్షులన్ని మరియు*
*వడ్లు, యవలు ప్రాణాపాన వాయువులును*
*దపము శ్రద్ధయు విధులు సత్యంబు బ్రహ్మ*
*చర్యము జనియించినవి ప్రశస్తముగను.*

## భావము

ఆ పరమ పురుషుని నుండియే కర్మాంగ భూతులగు దేవతలు, వసురుద్రాదిత్యాద్యనేక గణభేదముల చేత బహువిధములుగా జన్మించిరి. సాధ్యులను దేవతాగణవిశేషములు, కర్మాధి కృతులగు మనుష్యులు, గ్రామ్యారణ్య భేదములు గల పశువులును, పక్షులును, ప్రాణాపానములును, హవిస్సున కుపయోగపడు వ్రీహియవధాన్యములును పురుషసంస్కార లక్షణమును, తపస్సు, శ్రద్ధ, సత్యము బ్రహ్మచర్యము, విధులు, అన్నియును జనించినవి.

## 8 వ మంత్రము

*సప్తప్రాణాః ప్రభవన్తి తస్మాత్*
*సప్తార్చిషః సమిధః సప్తహోమాః*
*సప్త ఇమేలోకా యేషు చరన్తి ప్రాణా*
*గుహాశయా నిహితాః సప్తసప్త॥ 8*

గీ. శుద్ధచైతన్యమున నుండి శుభకరముగ
రెండు వీనులు నేత్రముల్ రెండు మరియు
నాసికారంధ్రముల్ రెండనంగ నోరు
పుట్టినవిల సప్తప్రాణములు గ్రమాన

గీ అరయ సప్తేంద్రియంబుల నందునుండి
జననమందు సప్తజ్వాల లనగ జగతి
సప్తసమిధలు హోమముల్ సప్త సంఖ్య
నమరి హృద్గుహాలోన లోకాళి ఏడు
పుట్టినవి ప్రాణశక్తులు మునుజరింప

## భావము

ఆపరమ బ్రహ్మమునుండి రెండు నేత్రములు, రెండు కర్ణములు, రెండు నాసికారంధ్రములు,ముఖములను సప్తప్రాణములు, ఆయా యింద్రియములకు సహజమయిన స్వవిషయములను, ప్రకాశింపజేయుటయందు సప్తజ్వాలలును, ఆయా యింద్రియ విషయములను సప్తసమిత్తులు, ఆయా విషయజ్ఞానములను సప్తహోమములు, నిద్రాకాలమున హృదయపుండరీకమను గుహ నివసించి యుండునట్టి ప్రాణములు, ప్రాణాపానాది కృత్యముల నిర్వర్తించుటకు కన్నులు మున్నగు గోళముల నాశ్రయించుచున్నవో అట్టి యింద్రియ గోళములు పుట్టుచున్నవి.

## 9వ మంత్రము

అతః సముద్రా గిరయశ్చ సర్వే ౽
స్మాత్ స్యందంతే సింధవః సర్వరూపాః
అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ
యేనైష భూతైస్తిష్ఠతే హ్యంతరాత్మా ॥౯

గీ సాగరములన్ని గిరులన్ని సాగిపారు
నేరులందుండి పుట్టిన వెల్ల మరియు
స్థూల సూ
పంచభూతంబులావరింపంగ నొప్ప
రసములోషధుల్ పోషింప బ్రభవమందె.

## భావము

ఈ పరమపురుషుని నుండియే క్షీరాది సప్తసముద్రములును, హిమవదాది పర్వతములును, పుట్టుచున్నవి. ఈ పరమ పురుషుని నుండియే గంగాది సకల నదులు నానా విధరూపములలోఁ బ్రవహించుచున్నవి. సూక్ష్మశరీరము పంచభూతముల చేత ఆవరించఁబడినది. పంచభూతములు ఓషధుల యొక్క రసాదుల చేతఁ బోషింపఁ బడుచున్నవి. ఆ ఓషధులు గూడా ఆ పరమ పురుషుని నుండియే ప్రభవించినవి.

## 10 వ మంత్రము

*పురుష ఏ వేదం విశ్వం కర్మ*
*తపో బ్రహ్మ పరామృతం*
*ఏతద్యో వేద నిహితం గుహాయాం*
*సో విద్యా గ్రంథిం వికిర తీహ సౌమ్య! ॥ ౧౦*

గీ. *సౌమ్య! కర్మ తపస్సు విశ్వంబు నంత*
*పురుషుఁడే యుత్తమంబు సంపూజ్యమమృత*
*మయిన బ్రహ్మమే హృదయ గుహాంతరమున*
*నిండియున్నదని ఎరుంగ నిశ్చయముగ*
*మొదట నిందె యజ్ఞానపు ముడులు దొలుగు.*

## భావము

ప్రియదర్శనుఁడవగు ఓ శౌనకా! ఈ ప్రపంచమంతయు పరమ పురుషుఁడే అగ్నిహోత్రాది రూపమగు కర్మయును జ్ఞానమును పురుషుఁడే, ఎవడు సకల ప్రాణుల యొక్క హృదయ గుహయందున్న వానిగా బ్రహ్మము నెరుగు చున్నాడో, వాడు పీటముడివలె దృఢముగా నున్న అవిద్యా వాస నారూపమయిన హృదయ గ్రంధిని బ్రతికియుండగనే, ఈ శరీరమునందే ఛేధించు కొనుచున్నాడు.

### ఇది ద్వితీయ ముండకములో ప్రథమ ఖండము.

# ద్వితీయ ముండకము
# ద్వితీయ ఖండము

## 1వ మంత్రము

*ఆవిః సన్నిహితం గుహాచరం నామ*
*మహత్ పదమత్రైతత్ సమర్పితం*
*ఏజత్ ప్రాణన్నిమిషచ్చ యదేత జ్ఞానథ సదన*
*ద్వరేణ్యం పరం విజ్ఞానాత్ యద్వరిష్ఠం ప్రజానాం ॥*

సీ. *భవ్యంబును ప్రకాశవంతంబు సన్నిహితంబును హృద్గుహాంతర చరంబు*
*నౌ బ్రహ్మమాధార మన్నింటికిని గదలాడునవియు,*
*రెప్పలార్చునవియు శ్వాసించునవి యన్ని, సకల ప్రపంచంబు*
*బ్రహ్మంబు నందునే వఱలు చుండుస్థూల సూక్ష్మంబులు శోభిల్లు దానౌచు*
*నారాధ్యమై యొప్పచలరు చుండు*

గీ. *ప్రాణులన్నింట శ్రేష్ఠమై ప్రథితమగుచు*
*జ్ఞానమునకతీతం బౌచుఁగానుపించు*
*నట్టి చైతన్యము నెరుగుమయ్య! నీవు*
*బ్రహ్మమెరుగంగ బ్రహ్మమై పరిఢవిల్లు.*

## భావము

ప్రకాశస్వరూపమును, తిర్యగాది సకల విధ ప్రాణుల యొక్క హృదయమునందు దర్శన, శ్రవణ, మనన, విజ్ఞానాది ఉపాధి ధర్మముల చేత ప్రకాశించుచున్నదో ఆ బ్రహ్మము బుద్ధి గుహాయందుండునదిగాను, ప్రఖ్యాతి వహించినదియు, అన్నింటి కంటె గొప్పది యగుట చేత మహత్తని చెప్పఁబడునదియు, సకల పదార్థములకు ఆస్పదమగుట చేత పదమని చెప్పఁబడుచున్నది. రథచక్ర నాభియందు బండి ఆకుల వలె యీ బ్రహ్మమునందే జగత్తంతయు సంలగ్నమై యున్నది. చలించు పశు పక్ష్యాదులును, ప్రాణాపానములు గల మనుష్యులు, పశువులును, నిమేషాది క్రియలొనర్చునట్టి ప్రాణిజాతము బ్రహ్మమునందే సమర్పితమై యున్నవి. అట్టి సర్వాస్పదమగు బ్రహ్మమును తెలుసుకొనుడు. దీనిని మూర్తామూర్తములును, స్థూలసూక్ష్మములునగు సదసత్స్వరూపముగా నెరుగుడు. నిత్యమగుట చేత వరేణ్యమని చెప్పఁబడు చున్నది. లౌకిక విజ్ఞానమునకు గోచరముగానిది. శ్రేష్ఠములైన సర్వపదార్థముల లోపల సర్వదోషరహితమగుట చేత బ్రహ్మము వరిష్ఠమని చెప్పఁబడును. అట్టి బ్రహ్మము నెరుంగుము.

## 2. వ మంత్రము

యదర్చిమత్ యదణుభ్యోஉణు చ
యస్మింల్లోకా నిహితా లోకినశ్చ
తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణస్తదు వాఙ్మనః
తదేతత్ సత్యం తదమృతం తత్ వేద్ధవ్యం విద్ధి ॥ 2

గీ. అరయగఁ బ్రకాశవంతంబు నణువు కన్న
నధిక సూక్ష్మాతి సూక్ష్మంబు నైన నదియె
అక్షర బ్రహ్మతత్త్వమౌ నదియె సకల
లోకములకు నివాసంబు లోకవాసు
లకును వాసంబు నయ్యదే ప్రకటముగను.

గీ. అదియె ప్రాణము వాక్కును నదియె మనము
సత్యమమృతత్త్వమయ్యది సౌమ్య! వినుము
అట్టి బ్రహ్మమెరుంగుమోయయ్య! నీవు
ఆత్మ నెరిగిన యట్టివాడమరుఁ డగును.

## భావము

ఏది ఆదిత్యాది కాంతి మత్పదార్థములన్నింటి కంటే ఎక్కువ కాంతిఁగలదియో ఏది అతి సూక్ష్మములగు అణువుల కంటేసూక్ష్మమయినదో స్థూలమైనపదార్థముల కంటే మిగుల స్థూలమైనదో దేనియందు భూమ్యాది చతుర్దశ లోకములును ఆలోకములందుండు చైతన్యాశ్రయములగు మనుష్యాది ప్రాణి సమూహములును ఉన్నారో అన్నింటికి సర్వాశ్రయమైనదియో నాశరహితమగు పరబ్రహ్మము అదియే ప్రాణము. అదియే వాక్కు, అదియే మనస్సు, అదియే యింద్రియ సముదాయ మగుచున్నది. ఆ అక్షర పరబ్రహ్మమే సత్యము. అదియే నాశనరహితమైనది దానినే నీవు గురిచూచి కొట్టవలయును. అనగా మనస్సును దానియందు సంలగ్నము చేయవలయును. అట్టి యక్షరము నెరుంగుము. దానియందు నీ చిత్తమును లగ్నము చేయుము.

## 3. వ మంత్రము

ధనుర్గృహీత్వౌ పనిషదం మహాస్త్రం
శరం హ్యుపాసా నిశితం సంధయీత

అయమ్య తద్భావ గతేన చేతసా
లక్ష్యం తదేవాక్షరం సౌమ్య! విద్ధి!

గీ. ఔపనిషద మహాస్త్రంబు నందు కొనుచు
ధనువుగా గొని యెపు డుపాసనల చేత
నెసగువాడి యౌబాణంబు నెక్కుపెట్టి
మరియు బ్రహ్మ భావన లగ్నమనము తోడ

గీ. దాని సంధించి లాగుము తగిన నిష్ఠ
సరిగ దీనికి లక్ష్యమౌ స్థానమరయ
ప్రథితమైన యక్షర పరబ్రహ్మమగును
సత్యమగు దీని దెలియుమో సౌమ్య! నీవు.

## భావము

సౌమ్యుఁడా! ఉపనిషత్తులకు సంబంధించినట్టిదియు, గొప్పదియునగు ధనుస్సును జేతఁబట్టుకొని, నిత్యోపాసన చేఁబదునెక్కిన చిత్తమనెడి బాణమును, దాని యందుఁజేర్చుము. ఆ చిత్తమును వివిధ విషయముల నుండి మరలించి బ్రహ్మభావనయందే లగ్నమైన దిగాఁజేసి లక్ష్యమగు అక్షరపర బ్రహ్మమును గొట్టవలయును.

## 4. వ మంత్రము

ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్ తన్మయో భవేత్ ॥4

గీ. ప్రణవమే ధనువాత్మయే బాణమగును.
బ్రహ్మయే లక్ష్యమౌను స్థిరంబునైన
చిత్తమున దాని ఛేదింప జేరి ఆత్మ
బ్రహ్మమున నైక్యమై పోవు ప్రాజ్ఞ! వినుము.

## భావము

ఓంకారమే విల్లు ఆత్మయే బాణము బ్రహ్మమే దానికి లక్ష్యస్థానము. స్థిరచిత్తముతో నాలక్ష్యమును ఛేదించవలయును. బాణము లక్ష్యమును ఛేదించి ఆ స్వరూపముతో నేకమగునట్లు బ్రహ్మమున నైక్యమై పోవలయును. ఓంకారమును ధ్యానించువాడు ఓంకార స్వరూపమే కాఁగలడు. చక్కగా నెక్కు పెట్టిన బాణము లక్ష్యస్థానమును జేరినట్లు సక్రమముగా ప్రణవ ధ్యానము జరిగినచో జీవాత్మ పరమాత్మతో నైక్యమగును.

## 5వ మంత్రము

*యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షమోతం*
*మనః సహప్రాణైశ్చ సర్వైః*
*తమే వైకం జానథ ఆత్మాన మన్యా*
*వాచో విముఞ్చథా మృతస్యైష సేతుః*

గీ. *భువియు నాకాశమును మధ్యపొసగు నట్టి*
*అంతరిక్షంబు, ప్రాణంబులా మనంబు*
*నరయ నెందల్లుకొనియుండునదియె యాత్మ*
*చెలగి యమృతత్త్వమునకది సేతు వగును*
*వ్యర్థమగు పల్కులను నీవు వదలుమింక.*

## భావము

దేనియందు భూవ్యాకాశములు, వాటి మధ్యనున్న అంతరిక్షము, మనస్సు, పంచప్రాణములు, అల్లుకొని యుండునో, అదియే యాత్మయని యెరుంగుము. అమృతత్త్వమున కదియే సేతువు. వ్యర్థప్రసంగములను వదలి పెట్టుము.

## 6 వ మంత్రము

*అరా ఇవరథనాభౌ సంహతా యత్ర నాడ్యః*
*నఏషో ౨ న్తశ్చరతే బహుధా జాయమానః*
*ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం*
*స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్॥6*

గీ. *అరయ రథచక్రమందున నాకులన్ని*
*యిరుసు జేరి యుండెడి రీతినెల్లనాడు*
*లాహృదయ మందు గలియు నందాత్మ యెపుడు*
*బహువిధంబుల జరియించు ప్రథిత మగుచు.*

గీ. *అట్టి యాత్మయే యోంకార మంచునెంచి*
*ధ్యాన మొనరించుడీ! మీరు తథ్యమిదియె*
*అంధకారంబు నంతటి నధిగమించి*
*పారమును జేర మీకిక స్వస్తియగుత.*

## భావము

రథచక్రములోని యాకులన్నియు నిరుసును జేరియున్నవిధముగా నాడు లన్నియు హృదయ స్థానమునఁ గలసిపోవును. ఆహృదయములో నాత్మ అనేక విధములుగాఁ జరించు చుండును. ఆయాత్మనే యోంకారముగా ధ్యానించుడు. అంధకారముననధిగమించి పారము చేరుటలో మీకు శుభములు కలుగుగాక!

## 7. వ మంత్రము

*యః సర్వజ్ఞః సర్వవిద్యస్యైష మహిమా భువిః*
*దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః*
*మనోమయః ప్రాణశరీర నేతా*
*ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ*
*తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరాః*
*ఆనందరూప మమృతం యద్విభాతి॥7*

సీ. *బ్రహ్మండ మంతయు బ్రహ్మంబు సత్యంబు సర్వజ్ఞు డాతండు సర్వవిదుఁడు*
*జగములందంతట సాక్షాత్కరించెడి ప్రతిదియు వాని వైభవము చూడ*
*ప్రాణశరీరాధిపతి యతండా మనో వస్త్రంబు ధరియించి ప్రాభవమున*
*నా హృదయాకాశమందున దివ్యమౌ బ్రహ్మపురి స్థిరత పరిఢవిల్లు.*

గీ. *హృదయమున నిల్చి తనువు నందెల్ల నుండు*
*భాసురానంద సుస్వరూపంబునైన*
*దివ్యమమృత తత్త్వంబున ధీరపురుషు*
*లరయఁ గలరు బ్రహ్మజ్ఞానమంత ఁబొంది.*

## భావము

బ్రహ్మాండమంతయు సత్యమగు బ్రహ్మస్వరూపమే. అతడు సర్వజ్ఞుఁడు, సర్వవిదుఁడు, జగత్తు నందు గోచరించునదంతయు వాని వైభవమే. ప్రాణశరీరముల కధిపతియై మనో వస్త్రమును ధరించి హృదయాకాశములోని తేజోవంతమగు బ్రహ్మపురిలో నతడు స్థిరముగా నున్నాడు. హృదయమునఁ బ్రతిష్ఠితుఁడై శరీరమందంతట వసించును. ధీరపురుషులు బ్రహ్మజ్ఞానమును బొంది ఆనంద స్వరూపమైన అమృతత్త్వమును దర్శించెదరు.

## 8 వ మంత్రము

*భిద్యతే హృదయ గ్రంథిః*
*ఛిద్యంతే సర్వసంశయాః*
*క్షీయంతే చాస్య కర్మాణి*
*తస్మిన్ దృష్టే పరావరే॥8*

గీ. *కార్యకారణములఁజూడ గ్రుమత దొలగు*
*నంత హృదయగ్రంథి తెలియ నాత్మగతిని*
*సందియములన్ని నశియించు శాశ్వతముగ*
*కర్మలన్నియు క్షీణించు మర్మ మెరుగ.*

### భావము

*హెచ్చుతగ్గులగు కార్యకారణములను జూచినంతనే అజ్ఞానపు ముడి వీడిపోవును సందేహములన్నియు నశించి పోవును. కర్మలన్నియు క్షీణించును.*

## 9 వ మంత్రము

*హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మనిష్కలం*
*తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః తద్యదాత్మవిదో విదుః॥9*

గీ. *నిర్మలంబును, శుభ్రంబు నిష్కలంబు*
*జ్యోతులకు జ్యోతి బ్రహ్మంబు శుద్ధమైన*
*పరహిరణ్మయ కోశమందరయ నుండు*
*నాత్మవిదులెరింగిరిది సత్యంబుగాను*

### భావము

నిర్మలమైనది, నిష్కల్మషమైనది, పరిశుభ్రమైనది, జ్యోతులకు జ్యోతియగు బ్రహ్మము, నిగూఢమైన, హిరణ్మయ కోశమునందు నుండునని ఆత్మవిదులు తెలుసుకొనిరి.

## 10 వ మంత్రము

నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం

నే మా విద్యుతో భాంతి కుతో౽యమగ్నిః
తమేవ భాంత మనుభాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి॥

గీ. సూర్యచంద్రులు తారకల్ చూడ మెరుపు
లచట వెలుగుల నీయవా యగ్ని మాట
యింక జెప్పగా నేల? అందేల వెలుగు
జగతి సతతంబు తత్ప్రకాశంబు వలన.

## భావము

అచట సూర్యుడు ప్రకాశించడు, చంద్రుఁడు ప్రకాశించడు, తారకలు వెలుగుల నీయవు-మెరుపులు ప్రకాశించవు. ఇక అగ్నిమాట చెప్పనేల? అతని ప్రకాశముననుసరించియే సమస్తము ప్రకాశించును. ఈ ప్రపంచమంతయు వాని వెలుగుల చేతనే వెలుగు చున్నది.

## 11వ మంత్రము

బ్రహ్మై వేద మమృతం పురస్తాద్ బ్రహ్మ
పశ్చాత్ బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ
అధశ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మై వేదం విశ్వమిదం వరిష్ఠం॥

గీ. అమృతమయమైన బ్రహ్మమే అంత ఁజూడ
ముందు బ్రహ్మము వెనుక నాక్రింద పైన
బ్రహ్మమే కుడి ఎడమల బ్రహ్మమగును
శ్రేష్ఠమగు బ్రహ్మమంతట జెలగి యుండు.

## భావము

ఇదంతయు నమృతమయమగు బ్రహ్మమే యగును. ముందు బ్రహ్మము. వెనుక బ్రహ్మము. క్రింద, పైన, కుడి ఎడమల సర్వత్ర బ్రహ్మమే వ్యాపించియున్నది.

## ఇది ద్వితీయ ముండకమున ద్వితీయ ఖండము.

# తృతీయ ముండకము

## ప్రథమ ఖండము

### 1. వ మంత్రము

ద్వాసుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వ జాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్వ
నశ్నన్న్యో అభి చా క శీతి॥
సతత సహవాస మొనరించు సఖులు హితులు
రెండు పక్షులు వసియించు చుండు నొక్క
పాదపము పైన నాసక్తిఁ బండ్లు దినుచు
నొకటి యుండగఁజూచు మరొకటిదాని.

### భావము

ప్రాచీన భారతీయ మహర్షుల మేధాశక్తికిఁ గమనీయ కవితా చాతుర్యమునకీ మంత్రము చక్కని తార్కాణము. జీవాత్మ, పరమాత్మల నిజస్వరూపము నత్యద్భుతమగు రీతిలో విశద పఱచుచున్నది. ఎల్లప్పుడు కలసియుండు స్నేహితులైన పక్షులు రెండునొకే చెట్టుపైఁ గూర్చొని యున్నవి. అందొకటి చెట్టుపండ్లను దినుచుండగా మరొకటి ఏమియును దినక దానినిఁ జూచి ఆనందించుచున్నది.

### 2 వ మంత్రము

సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ
నీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య
మహిమానమితి వీతశోకః ॥2

గీ. ఇటుల నొక చెట్టునే యాశ్రయించి యున్న
పక్షులందున్న జీవాత్మ పక్షి యొకటి.
భ్రాంతి నజ్ఞానమున మున్గి పరితపించు
తన యశక్తత హీనతఁ దలచు చెపుడు.

గీ తరువు పైనుండి పండ్లను దగుల కుండ
తనను వీక్షించి ముదమందు ననఘు (బూజ్య
ప్రభుని బరమాత్మ వాని వైభవము (జూడ
దానికంతనే శోక మంతయును బోవు

## భావము

ఈ విధముగా నొకే చెట్టునాశ్రయించి యున్న రెండు పక్షులలో నొకటైన జీవాత్మ అజ్ఞానము చేత భ్రాంతి(జెంది తన యశక్తతకు( బరితపించుచున్నది. తరువుపై ఫలముల( దగులక ముదమందు పూజ్యార్హమును ప్రభువునగు పరమాత్మను దాని వైభవమును జూచినంతనే దాని దుఃఖమంతయు (దొలగిపోవును.

## 3 వ మంత్రము

యదాపశ్యః పశ్యతే రుక్మ వర్ణం
కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిం
తదా విద్వాన్ పుణ్యపాపే విదూయ
నిరంజనః పరమం సామ్యముపైతి 3

గీ విశ్వకర్తను బరమాత్మ విశ్వభర్త
బ్రహ్మయోనిని (బురుషు సువర్ణ వర్ణు
నరయు పరమర్షి పాపపుణ్యముల వదలి
అమల పరమ సమస్థితి నందు కొనును

## భావము

విశ్వకర్తయును, విశ్వభర్తయును, స్వప్రకాశము గలవాడును, బ్రహ్మయోనియునగు పరమాత్మను దర్శించు ప్రజ్ఞావంతుడైన పరమర్షి నిర్మలమును సర్వోత్తమునైన సమస్థితిని( బొందును.

## 4 వ మంత్రము

ప్రాణోహ్యేషయః సర్వ భూతైర్విభాతి
విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ
ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావాన్
ఏష బ్రహ్మవిదాం వరిష్ఠః 4

గీ. ప్రాణులందునఁ బ్రాణమై క్రాలుచుండు
బ్రహ్మ మెరిగినవా డతి వాది కాడు
విబుధుఁడై యాత్మఁగ్రీడించు వివిధ పుణ్య
కర్మలాచరించుచు నగ్రగణ్యుడగును .

## భావము

ప్రాణులన్నింటిలోఁ బ్రాణమై ప్రకాశించుచున్న బ్రహ్మము నెరిగినవాడు, వ్యర్థప్రసంగములు చేయు వదరుబోతుగాక నిజమైన విద్వాంసుడగును. అతడాత్మ యందే క్రీడించుచు రమించుచు, పుణ్యకర్మల నాచరించుచు బ్రహ్మవిదుల యందగ్రస్థానము వహించును.

## 5వ మంత్రము

*సత్యేన లభ్యస్త పసా హ్యేష ఆత్మ*
*సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం*
*అంత: శరీరే జ్యోతిర్మయోహి శుభ్రో*
*యం పశ్యంతి యతయ: క్షీణ దోషా: ॥5*

గీ. సత్యమునఁ దపంబున సరిగ జ్ఞాన
మునను బ్రహ్మచర్యంబునఁ దనువునందె
పాపరహితులు యతులెల్లఁ బావనంబు
నాత్మ జ్యోతి ర్మ ...ంబును నరయఁగలరు.

## భావము

పాపరహితులగు సన్యాసులు సత్యతపోజ్ఞాన బ్రహ్మచర్యాదుల చేత జ్యోతిర్మయము పరిశుద్ధమునైన ఆత్మను తమ దేహములోనే దర్శింతురు.

## 6-వ మంత్రము

*సత్యమేవ జయతే నానృతం*
*సత్యేన పంథా వితతో దేవయాన:*
*యేనా క్రమన్తి ఋషయో హ్యాప్తకామా*
*యత్రతత్ సత్యస్య పరమం నిధానం ॥6*

గీ. సత్యమే జయించును గాద సత్యమెపుడు
సత్యమున దేవయానంబు సత్య సుపథ
మమరు నాప్తకాములగు మహర్షులెల్లఁ
బరమ పదముఁ జేరెదరు సత్పథము వలన.

భావము

సత్యమే జయించును, అసత్యము జయింపలేదు, సత్యము చేత దేవయానమేర్పడియున్నది ఆప్తకాములైన మహర్షులీ సత్యమార్గము ద్వారా సత్యనిలయమ్మైన పరంధామమును జేరెదరు.

7 – వ మంత్రము

*బృహచ్చ తత్ దివ్యమచింత్య రూపం*
*సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి*
*దూరాత్ సుదూరే తదిహాంతి కేచ*
*పశ్యత్స్విహైవ నిహితం గుహాయాం*

గీ. బహువిశాలంబు దివ్యంబు బ్రహ్మమెపుడు
చూడ సూక్ష్మాతి సూక్ష్మంబు సురుచిరంబు
మరియు దూరాతి దూరంబు మహితమ్మైన
యది యచింత్య రూపంబు దేహంబునందె
యలరు ఋషులు హృదయ గుహ నరయఁ గలరు.

భావము

బహు విస్తారమును చింతించుటకు వీలు కానిదియునగు బ్రహ్మము ప్రకాశించును. అది సూక్ష్మాతి సూక్ష్మము, దూరాతి దూరమునై యున్నది. అది యిక్కడనే యీ శరీరము నందే యున్నది. మహర్షులు హృదయ గుహలో నున్న దానిని యీ జన్మలోనే సాక్షాత్కారము చేసుకొందురు.

8 – వ మంత్రము

*న చక్షుషా గృహ్యతే నాపి వాచా*

నాన్యైర్దేవైస్తపసా కర్మణావా
జ్ఞానప్రసాదేన విశుద్ధ సత్త్వస్తతస్తు తం
పశ్యతే నిష్కలం ధ్యాయమానః ॥8

గీ. కనులు గనలేవు వాక్కులు వినుతిఁ జేయ
జాల వాత్మను గ్రహియింప జాల వింద్రి
యంబులు తపము కర్మలు వ్యక్తపఱుప
శక్తిహీనంబు లౌను నిజంబు సుమ్ము.

గీ. చెలగి జ్ఞాన ప్రసాదంబు చేత నతడు
తవిలి పరిశుద్ధ సత్త్వుఁడై అవయవాది
భేద వర్జితంబుగ సద్వివేక మొప్ప
ధ్యాన మొనరింపగా నాత్మ నరయఁగలడు.

## భావము

సాధకునకాత్మ తత్త్వము రూపరహితమగుట వలన నేత్రములఁ జేత గ్రహింపఁబడ జాలదు. నామధేయరహితమగుట వలన వాక్కు చేత గ్రహింప శక్యముగాదు. ఇటులనే మిగిలిన జ్ఞానేంద్రియముల చేతను, కర్మేంద్రియముల చేతను గూడా పొంద శక్యముగాదు. తపస్సుచేత సకల ప్రాప్తి కలుగుట లోకశాస్త్రానుభవ సిద్ధమే అయినను ఆత్మతత్త్వము మాత్రము తపస్సు వలనఁ గూడా పొంద సాధ్యముగాదు. వైదికములగు నగ్నిహోత్రాది కర్మల చేతఁ గూడా ఆత్మతత్త్వము తెలిసికొనఁబడఁజాలదు. జ్ఞానప్రసాదము చేత నిర్మలాంతఃకరణము గలవాడై సకలావయవ భేదవర్జితముగా, సత్యాది సాధనముల చేత నింద్రియంబుల జయించిన నేకాగ్ర చిత్తముతో ఆత్మను ధ్యానమొనరించుచు నాయాత్మ తత్త్వము నవలోకింపఁగలడు.

## 9–వ మంత్రము

ఏషో ऽ ణురాత్మా చేతసా వేదితవ్యో
యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ
ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం
యస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా ॥9

గీ. ఏ శరీరంబున నేర్పడ ముఖ్యమౌ
ప్రాణంబు ప్రాణమపాన మనగ
మరియు వ్యాన ముదాన మరయ సమానంబు

*లన నైదు భేదాల నందు జేరు*
*నట్టి శరీరంబు నందునే హృదయాబ్జ*
*మందణు రూపమై యాత్మ యలరు*
*ఇంద్రియంబుల చేత నెల్లవేళల యందు*
*చిత్తంబు వ్యాప్తమై చెలగుచుండు.*

గీ. అట్టి చిత్తంబు నిర్మల మయిన పిదప
నందు మిగులఁ బ్రకాశించు నాత్మకాన
నిర్మలాంతః కరణము చే నిత్యమయిన
నాత్మ నెరుగంగఁదగును సత్యంబుగాను.

## భావము

ఏ శరీరము నందు ముఖ్యమగు ప్రాణవాయువు ప్రాణాపానవ్యానోదానసమానములను అయిదు భేదములతో ప్రవేశించియున్నదో, అట్టి యీ శరీరము నందే హృదయారవిందము నందాత్మ నెరుంగవలయును. జీవుల యొక్క బుద్ధి ఇంద్రియ వ్యాపారముల చేత నెల్లప్పుడు వ్యాప్తమైయుండును. బుద్ధి నిర్మలమైనచో నాత్మయందుఁ బ్రకాశించును. ఇట్టి సూక్ష్మమయిన ఆత్మతత్త్వమును విశుద్ధ జ్ఞానము చేతనే ఎరుగవలయును.

## 10-వ మంత్రము

*యం యం లోకం మనసా సంవిభాతి*
*విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్*
*తం తం లోకం జయతే తాంశ్చ కామాం*
*స్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేత్ భూతి కామః ॥*

పరిశుద్ధ సత్య సంపన్నుఁడౌ జ్ఞాని, లో
కంబు నేదైనను గాంక్ష సేయ
బహువిధాభీష్టముల్ వాంఛింపఁ దనకైన
మరియన్యులకునేని మనము నందు
సిద్ధించు సత్యసంసిద్ధుఁడాత్మజ్ఞుఁడౌ
కతమున నవియన్ని క్షణము నందె
ఐశ్వర్యకాములౌ నవనీ జనంబులు
మహితాత్ముఁడౌవాని మహినిఁగొలిచి

గీ. భక్తి శుశ్రూషఁగావించి పరమ పురుష
తుల్యుఁడని నమ్మి మది నెమ్మి స్తుతులొనర్ప
నమ్మహాత్ముని సదనుగ్రహంబు వలన
నైహికాముష్మి కార్థంబులన్ని కలుగు.

## భావము

పరిశుద్ధమగు నంతఃకరణము గల జ్ఞాని తన మనస్సు చేత పితృ, దేవ, గంధర్వాది లోకములలో నేయే లోకమును దనకుఁగాని, యితరులకుఁగాని కావలయునని తలంచునో తనకుఁగాని యితరులకుఁగాని ఏయే విషయములు కావలయునని కోరునో, ఆత్మజ్ఞుఁడు సత్యసంకల్పుఁడు కావున అతడు కోరిన ఆయా లోకములు, అతడు కోరిన కోరికలు వెనువెంటనే సిద్ధించును. కావున నైశ్వర్యము నభిలషించు వారందరు ఆత్మజ్ఞానము చేత నిర్మలాంతఃకరణము గల బ్రహ్మవేత్తను పాదప్రక్షాళణ శుశ్రూషా నమస్కారాది సత్కారముల చేత పూజింపవలయును. బ్రహ్మవేత్త పరమేశ్వరునితో సమానుఁడు. కావునఁ బరమేశ్వరునిఁ బూజించుట వలన మనుష్యులకుఁ బుణ్యమెట్లు కలుగునో అటులనే అమ్మహాత్ములఁ బూజించుట వలన పుణ్యమును అవమానించుట వలన నరకమును సంప్రాప్తించును.

## ఇది తృతీయ ముండకమున
## ప్రథమ ఖండము

# తృతీయ ముండకము
## ద్వితీయ ఖండము

*సవేదైతత్ పరమం బ్రహ్మధామ*
*యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రం*
*ఉపాసతే పురుషం యే హ్యకామాస్తే*
*శుక్రమే తదతి వర్తంతి ధీరాః*

గీ. సకల సత్కామ ధామంబు, శాశ్వతంబు
నవ్యయంబు విశ్వాధారమగుచు వెలుగు
నట్టి యా పరబ్రహ్మంబు నాత్మవేత్త
యగు మహాత్ముఁడెరుంగు సత్యంబు సుమ్ము!

గీ. అట్టి ఆత్మజ్ఞుఁడైన మహాత్ము భక్తి
ధీరులెసగ నిష్కాములై కోరి కొలువ
భువినిఁ బునర్జన్మంబుఁ బొందరెపుడు
ఆత్మనంతట దర్శించు నాత్మవిదుఁడు.

### భావము

సకల కామములకు నాశ్రయ భూతమైనది, శాశ్వతమైనది, వ్యయముగానిది విశ్వాధారమైనది, స్వస్వరూపముచేఁ బ్రకాశించునదియగు పరబ్రహ్మమును ఆత్మజ్ఞాని తెలుసుకొనును. అట్టి ఆత్మ జ్ఞానియగు మహాత్ముని నాశ్రయించి భక్తితో నిష్కాములై యుపాసించు ముముక్షువులగు ధీమంతులు పునర్జన్మము నధిగమించెదరు. ఆత్మజ్ఞాని అంతట ఆత్మనే దర్శించును.

### 2–వ మంత్రము

*కామాన్ యః కామయతే మన్యమానః*
*సకామ భిర్జాయతే తత్ర తత్ర*
*పర్యాప్త కామస్య కృతాత్మ నస్తు*
*ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః* 2

గీ. విషయముల సంస్మరించుచు విషయములను
బొందఁగోరెడి వాడిలఁ బుట్టుచుండు

మరలనక్కడక్కడను గామముల తోడ
జ్ఞాని పరమార్థ తత్త్వ విజ్ఞాన మహిమ
కామములు దీరు నశియించుఁగామ వితతి.

## భావము

మోక్షము నందిచ్ఛ గలవానికిఁ గామ పరిత్యాగమే మోక్షమును బొందుటకు ముఖ్య సాధనము. ఎవడు దృష్టా దృష్టేష్ట విషయములకు సంబంధించిన కోరికలను గోరుచు నిరంతరమవి తన కెట్లు సంప్రాప్తించునా యని ప్రార్థించుచుండునో వాడు ధర్మాధర్మములకు కారణభూతములయినట్టి కామములతో నాయా జన్మములను బొందుచున్నాడు. విషయ ప్రాప్తి నిమిత్తములగు కోరికలు ఏయే విషయములందు పురుషునిఁ బ్రేరేపించునో అట్టి విషయముల ననుభవించుటకుఁ దదను రూపమయిన శరీరము నొంది ఆయా ఫలయుల యొక్క యనుభవమును బొందుచున్నాడు. పరమార్థ తత్త్వ విజ్ఞానము వలన పర్యాప్తకాముఁడు, జ్ఞానము చేత బ్రహ్మ స్వరూపుడునగు ఆత్మజ్ఞునకు మాత్రము యీ శరీరము నందే ధర్మాధర్మ ప్రవృత్తికి కారణభూతములగు కామములన్నియుఁ దీరును, మరియుఁ గోరికలు నశించుచున్నవి. కోరికలు కలుగుటకు హేతుభూతమయిన విషయేచ్ఛ నశించుటచేత కామములు జనింపవు.

## 3 – వ మంత్రము

*నాయమాత్మా ప్రవచనేన లభ్యో*
*న మేధయా న బహునా శ్రుతేన*
*యమేవైష వృణుతే తేన లభ్య*
*స్తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వాం॥ 3*

సీ. బహు వేదశాస్త్ర ప్రవచనంబుచేఁగాని
శిష్టమేధాశక్తి చేతఁగాని
వివిధ శాస్త్రార్థ సంశ్రవణంబుచేఁగాని
ఆత్మఁ బొందంగ శక్యంబు గాదు
మోక్షంబుఁ గాంక్షించు పుణ్యాత్ముఁడైనట్టి
బుధుఁడిలఁ బరమాత్ముఁ బొందఁగోరి
యంతర్ముఖుండయి యాపరమాత్మయే
తానని యెంచి నిత్యంబుఁ దలచ
గీ. నంత నాత్మసాక్షాత్కారమందఁగలడు

తద్భలీయమౌనిచ్చు యాత్మస్వరూప
మెరుగఁజేయు నవిద్యను బరిహరించి
చెలగి యాత్మ రూపముఁ బ్రకాశింపఁజేయు.

## భావము

ఆత్మతత్త్వము వేదశాస్త్రముల నధికముగాఁ జదువుట చేతఁబొందుటకు శక్యముగాదు. అటులనే చదివిన గ్రంధముల యొక్క అర్థమును మరువకుండా ధరించునట్టి మేధాశక్తిచేత వివిధశాస్త్ర శ్రవణము చేత కూడా ఆత్మతత్త్వము పొంద శక్యముగాదు – ముముక్షువగు విద్వాంసుఁడు ఏ పరమాత్మను బొందవలయునని కోరునో అంతర్ముఖుఁడై పరమాత్మ స్వరూపుడను నేనను అభేదాను సంధానము చేతనే యీ పరమాత్మ లభ్యమగును. ఎవరు హృదయపూర్వకముగా పొందుటకుఁ బ్రయత్నించునో అట్టి వానికి ఆత్మ తన స్వరూపమునుఁ దెలియఁజేయును.

## 4 – వ మంత్రము

*నాయమాత్మా బలహీనేన లభ్యో*
*నచ ప్రమాదాత్ తపసో వాప్యలింగాత్*
*ఏ తైరుపాయైర్యతతే యస్తు విద్వాం*
*స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ:* 4

సీ. సామర్థ్యహీనుఁడౌ జనునకాత్మ స్వరూ
పము పరికింప లభ్యంబు కాదు
భవబంధనంబులఁ బ్రాప్తించునట్టి ప్ర
మాదము చేత సంభవము గాదు
సన్యాస రహితమౌ జపమునఁదపమున
నాత్మ పొందంగ శక్యంబుగాదు
సన్యాస సహిత ప్రశస్త బలాప్రమా
దంబులు తపము సాధనములనెడి.

గీ. యీ యుపాయంబులను బూని యేబుధుండు
దీక్షతోడను గడు ప్రయత్నించుచుండు
నమ్మహాత్ముని మహిత జీవాత్మ క్రమతఁ
బ్రథితమైన బ్రహ్మ స్వరూపంబుఁ బొందు.

## భావము

ఈ యాత్మ స్వరూపము సామర్థ్య హీనుఁ డగు జనునకు లభ్యమగునది కాదు. దారా పుత్రాదుల యందాసక్తి యను ప్రమాదము గల చిత్త చాంచల్యము గల వానిచేఁ బొంద శక్యమగునది కాదు. సన్యాస రహితమైన ఆత్మజ్ఞానము చేత పొంద శక్యము గాదు. ముముక్షువగు నే పండితుఁడు బల, అప్రమాద, సన్యాస జ్ఞానములను ఉపాయముల చేత ఆత్మను బొందుటకుఁ బ్రయత్నించునో అట్టి ముముక్షువగు విద్వాంసుని యొక్క జీవాత్మ బ్రహ్మ స్వరూపమును బొందుచున్నది.

## 5–వ మంత్రము

*సంప్రాప్యైన మృషయో జ్ఞాన తృప్తాః*
*కృతాత్మానో వీతరాగాః ప్రశాంతాః*
*తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరాః*
*యుక్తాత్మానః సర్వమే వా విశంతి.* 5

సీ. ఆత్మ స్వరూపంబు నమ్మహాత్ములతీంద్రి
య ద్రష్టలైన మహర్షులెలమి
ప్రాజ్ఞులౌచును బరబ్రహ్మంబుఁ బొంది బ్ర
హ్మ జ్ఞానమునఁ దృప్తినంది మిగుల
ధన్యులౌచుఁ బరమాత్మ స్వరూపంబుచేఁ
బుణ్యాత్ములై పరిపూర్ణులగుచు
మరియు [illegible]గులై మహినిఁ బ్రశాంతులై
[illegible]ందు రెల్లప్పు డానంద మొప్ప.

గీ. నమ్మహాత్ములు సర్వగమయిన యట్టి
యా పరబ్రహ్మమంతట నరసి పొంది
ధీరులౌచు నేకాగ్రతన్ జేరి పొంది
నట్టి యాత్మఁగల్గియు నంత నందఁగలరు.

## భావము

అతీంద్రియ ద్రష్టలగు మహర్షులు, పరబ్రహ్మమును బొందిన వారగుచు నాత్మ జ్ఞానము చేత సంతృప్తి నందినవారై, పరమాత్మ స్వరూపము చేతఁ బరిపూర్ణులై నశించిన కామ క్రోధాది దుర్గుణములు గలవారై మిగుల శాంతిఁ బొందిన యింద్రియ వ్యాపారములు గల

వారలగుచున్నారు. అట్టి బ్రహ్మవేత్తలు ఆకాశమువలె అంతట నిండి నిబిడీకృతమైయున్న బ్రహ్మమునే అవ్యయమైన ఆత్మ తత్త్వముగా నంతట పొందినవారై ధీరులై ఏకాగ్రతను బొందిన అంతఃకరణము గలవారై శరీరపాతానంతరము సకలమును బొందుచున్నారు. ఛిన్నమైన ఘటమునందలి ఆకాశము మహాకాశమునందెటులఁజేరుచున్నదో అట్లే అవిద్యాకృతమైన ఉపాధి పరిచ్ఛేదమును బ్రహ్మవేత్త వదలి బ్రహ్మధామమును బొందుచున్నాడు.

## 6 – వ మంత్రము

*వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః*
*సన్న్యాసయోగాద్ యతయః శుద్ధ సత్త్వా*
*తే బ్రహ్మలోకేషు పరాంతకాలే*
*పరామృతాః పరిముచ్యంతి సర్వే.*

గీ. విమల వేదాంత విజ్ఞాన విలసితులును
శుభగ సన్న్యాసయోగ విశుద్ధ సత్త్వు
లయిన యతివరులెల్ల దేహాంత కాల
మందున మహాత్ములు దగబ్రహ్మ స్వరూపు
లగుచు నిందె జీవన్ముక్తులగుదురెలమి.

## భావము

ఉపనిషత్తుల యందుఁ బ్రతిపాదింపఁబడిన బ్రహ్మాత్మ విజ్ఞానమే నిశ్చయింపఁబడిన ప్రయోజనము గలవారును, సర్వకర్మ పరిత్యాగ లక్షణ రూపమయిన, సన్న్యాస యోగము వలన నిర్మలాంతః కరణము గలవారును, ప్రయత్నశీలురునగు, నా మహాత్ములందరు దేహావసాన సమయమునందు బ్రహ్మ స్వరూపమైన లోకముల యందు పరబ్రహ్మ స్వరూపులై ముక్తినిఁ బొందుచున్నారు.

## 7 – వ మంత్రము

*గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా*
*దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు*
*కర్మాణి విజ్ఞాన మయశ్చ ఆత్మా*
*పరే ఒవ్యయే సర్వ ఏకీభవంతి ॥7*

సీ. పంచదశ కళలౌ ప్రాణాది కళలు బ్ర
హ్మాత్వమందంగ లయంబుఁ బొందు
సర్వేంద్రియంబులు చక్కఁగా సూర్యాది
ప్రతి దేవతలలోనఁ బరగఁ జేరు
బ్రహ్మ విజ్ఞానంబు ప్రాప్తించుటకు మున్ను
జేసిన కర్మలు శీఘ్రముగను
విజ్ఞానమయుఁడగు విమల జీవుండును
బరము ననంత మవ్యయమజంబు

గీ. నద్వయ మనంత మమృతము ననపరంబు
నభయము నపూర్వము ననంత మధిక శుభద
మైన యాపరబ్రహ్మంబు నందు నరయ
నైక్యమగుచున్న వన్ని సత్యంబుగాను.

## భావము

మోక్షకాలము నందు ముక్త పురుషుల శరీరములలోని ప్రాణాది పంశ దశ కళలు కార్యరూపములు గనుక తమకుఁగారణ భూతములయిన వానియందుఁ జేరిపోవుచున్నవి. శరీరమునందున్న నేత్రాదిగోళకములందుండు ఇంద్రియములు అధిష్ఠాన దేవతలగు సూర్యుఁడు మున్నగు ప్రతి దేవతలను బొందుచున్నవి. బ్రహ్మ జ్ఞానమందుటకు ముందు చేసిన కర్మలు, కర్మఫలములు, జీవాత్మయు, శ్రేష్ఠముననంతమును, అవ్యయమును, అజమును, అద్వయమును, అనంతమును, అమృతమును, అనపరమును, అభయమును, అపూర్వమును, అనంతమును, అధిక శుభదము నగు బ్రహ్మమునందైక్యమగు చున్నవి.

## 8.వ మంత్రము.

*యధానద్యః స్యందమానాః సముద్రేఽస్తం*
*గచ్ఛంతి నామ రూపే విహాయ*
*తధా విద్వాన్ నామరూపా ద్విముక్తః*
*పరాత్పరం పురుష ముపైతి దివ్యం . 8*

గీ. వసుధఁబ్రవహించు నదులెల్ల వార్ధిఁగలసి
వివిధ నామరూపంబుల వీడు రీతి
ఆత్మవిదుడును నామ రూపాళి వదలి
దివ్య పురుషుఁ బరాత్పరుఁ దెలిసి పొందు.

## భావము

వసుధ యందు నామరూపములు గలిగి ప్రవహించుచున్న గంగాది మహానదులు సముద్రమునందుఁ గలసి తమ తమ నామరూపములను వదలి సముద్రమునందు వేరుగాను కనుపించక సముద్ర రూపమునే యెటులఁ బొందు చున్నవో అటులనే బ్రహ్మవేత్తయగు వాడు లవిద్యా కృతమగు నామ రూపములను వదలిన వాడై పరాత్పరుఁడును ప్రకాశ స్వరూపుడును నగు పురుషుని c బొందు చున్నాడు.

## 9 – వ మంత్రము.

*సయోహా వైతత్ పరమం బ్రహ్మవేద*
*బ్రహ్మైవ భవతి నాస్యా ( బ్రహ్మవిత్ కులేభవతి*
*తరతి శోకం తరతి పాప్మానం*
*గుహా గ్రంథి భ్యోవిముక్తో ఉ మృతో భవతి.*

గీ: ఎవడు ధర పరబ్రహ్మంబు నెరుగునతడు
తాను బ్రహ్మస్వరూపుఁడై తనరుచుండు
బ్రహ్మవేత్త కులంబున బ్రహ్మవేత్త
కానివాడిలఁ బుట్టడు కనుము నిజము

గీ: శోకమును దాటు పాపమున్ జూడ చాటు
వెలయగ హృదయగ్రంధులు వీడి పోవ
పరమ పురుషుఁ డై యమృత తత్త్వంబునందు
బ్రహ్మవిజ్ఞాన వేత్తయౌ పండితుండు.

## భావము:

ఎవడు శ్రేష్ఠమగు పరబ్రహ్మమును దెలుసు కొనునో అతడు సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడే యగు చున్నాడు. ఈ బ్రహ్మవేత్త వంశమునందు బ్రహ్మవేత్త కాని వాడు జన్మింపడు, ఇతడు జీవద్దశ యందే సుఖ దుఃఖములను ధర్మాధర్మముల నతిక్రమించుచున్నాడు. బ్రహ్మవేత్త హృదయ గ్రంధినుండి విముక్తుఁడై అమృత స్వరూపుఁ డగు చున్నాడు.

## 10.వ మంత్రము

*తదేత దృచాభ్యుక్తం-*
*క్రియావంత: శ్రోత్రియా బ్రహ్మనిష్ఠా:*
*స్వయం జుహ్వతి ఏకర్షిం శ్రద్ధయంత:*
*తేషా మే వైతాం బ్రహ్మ విద్యాం వదేత*
*శిరోవ్రతం విధివద్ యైస్తు చీర్ణం ॥*

గీ: భవ్యవేద సంప్రోక్తమౌ బ్రహ్మవిద్య
శ్రోత్రియులను గర్మిష్ఠులౌ శుచియుతులను
బ్రహ్మనిష్ఠాగరిష్ఠులౌ పండితులను
శ్రద్ధగలవారి కిది బోధ సలుపవలయు

గీ: అరయ 'నే కర్షి' యను హోమ మాచరించు
వారికి విధులఁ దగ శిరోవ్రతము సలుపు
నర్షులగు సంస్కృతాత్ముల కముల మౌచుఁ
జెలగు బ్రహ్మవిద్య నుప దేశింపవలయు.

## భావము:

ఋగ్వేదమంత్రముల చేత నీ బ్రహ్మవిద్యా సంప్రదాయము చెప్పఁబడినది. ఆయా వర్ణాశ్రమముల విధింపఁబడినది శ్రౌతస్మార్త కర్మల ననుష్ఠించు వారికి, శ్రద్ధగల వార లై ఏకర్షి యను నగ్నిని స్వయముగాఁ వ్రేల్చు నర్షులగు సంస్కృతాత్ములకు శిరస్సు నందు నగ్నిని ధరించుట యే లక్షణగాఁ గలది కనుక అధర్వణ ప్రసిద్ధమగు శిరోవ్రతమును యధావిధిగా నాచరించు వారికిని యీ బ్రహ్మవిద్యనుపదేశింప వలయును.

## 11-వ మంత్రము

*తదేతత్ సత్యమృషి రంగిరా:*
*పురోవాచ నైతదచీర్ణవ్రతోஉధీతే*
*నమ: పరమ ఋషిభ్యో*
*నమ: పరమ ఋషి భ్య: ॥*

గీ: సుప్రసిద్ధంబు సత్యంబు శుభకరంబు
నైన యీ బ్రహ్మవిద్య నా యంగిరసుఁడు
శిష్య శౌనకున కుపదేశించె మిగుల
పరమ ఋషులకు మునులకు వందనములు.

## భావము:

పూర్వకాలము నందు యథా శాస్త్రముగా బ్రహ్మవిద్యార్థమై తనకడకరుదెంచిన శౌనక మహర్షికి అక్షరమును సత్యమును నగు బ్రహ్మవిద్యనుపదేశించెను. అటులనే యిప్పటి బ్రహ్మవేత్తలును శ్రేయోఽర్థియై ముముక్షువులై, యథాశాస్త్రీయముగా శరణుగోరిన శిష్యునకు బ్రహ్మవిద్యనుపదేశింప వలయును, శిరోవ్రతము నాచరింపని వాడీ యుపనిషత్తును, బఠింపఁ గూడదు. వ్రతాను సారము వ్యవహరించి పఠించిననేఁ గాని విద్యాఫలము గలుగదు. బ్రహ్మదేవుని నుండి పారంపర్యక్రమముగా బ్రహ్మ విద్యను బొందిన పరను ఋషులకు నమస్కారము. ఆ పరమర్షులకు నమస్కారము.

ఓం తత్సత్
సర్వం శ్రీ పరమేశ్వరార్పణమస్తు
శ్రీ శ్రీ శ్రీ

★★★

### శాంతి మంత్రం:

*ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవా :*
*భద్రం పశ్యేమాక్షభిర్యజత్రా :*
*స్థిరైరంగైస్తు ష్టు వాగ్ం సస్తనూభి :*
*వ్యశేమ దేవహితం యదాయు :*
*స్వస్తిన ఇంద్రో వృద్ధ శ్రవా :*
*స్వస్తినః పూషా విశ్వవేదా :*
*స్వస్తినస్తార్క్ష్యో అరిష్ట నేమి :*
*స్వస్తినో బృహస్పతిర్దధాతు.*
*ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥*

### గద్యము

*ఇతి శ్రీసీతారామచంద్ర కరుణా కటాక్ష సంప్రాప్త కవిత్వ! హృద్య విద్యా విచిత్రఆపస్తంభ సూత్ర, కౌండిన్యస గోత్ర పవిత్ర. లక్ష్మీనరసమాంబికా వేంకయ శర్మ సుపుత్ర, దేవులపల్లి వంశపయః పారావార సంపూర్ణ పూర్ణిమా సుధాకర, సకల గుణ రత్న రత్నాకర,, భద్రాద్రి శ్రీరామచంద్రసుప్రభాత శ్రీశైల మల్లి కార్జున శతక, ఆనందసుధా లహరీ శ్రీ మద్రామాయణ కథా సుధాలహరి, శ్రీ మదాంధ్ర శివానందలహరీ శ్రీమదాంధ్ర సౌందర్య లహరీ, శ్రీ రాఘవేంద్ర సుప్రభాతాది ప్రముఖ సద్గ్రంధ రచనా ప్రసిద్ధ, విద్యార్జన విధేయ, చెంచు సబ్బయ శర్మ నామధేయ ప్రణీతం బయిన యాంధ్ర పద్య చంద్రి కాలఘు వ్యాఖ్యాన సహిత ముండ కోపనిషత్: సర్వము సంపూర్ణము.*

*ఓం తత్సత్*



మధురకవి : శ్రీ దేవులపల్లి చెంచు సుబ్బయ్య

జననం : 25-2-1949

తల్లిదండ్రులు :- లక్ష్మీనరసమ్మ, వెంకయ్యశర్మగారలు

ఉద్యోగము :- ప్రధానాంధ్ర పండితులు

జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల, పెద్దతుంబళం

బిరుదములు :- భక్తకవిరత్న, కవికిశోర మధురకవి

అవార్డులు :- (1) ఉత్తమోపాధ్యాయునిగా కర్నూలు జిల్లా అవార్డు

(2) ఉపాధ్యాయ జాతీయ సంక్షేమ మండలి.

రాష్ట్ర ప్రభుత్వ అవార్డు